6. విణ. స్థూలః-లా-లం; పృథుః-థుః-థు; మాంసలః; మహాకాయః; అంశలః-అంసలః; బృహచ్ఛరీరః; మేదస్వీ-స్వినీ-స్వి. 7. విశాలః-లా-లం; విస్తీర్ణః; విపులః; అసంబాధః; సావకాశః. 8. చూ. 4. అంకపొంకములు 9. చూ. 1. ఉక్కడము. 10. చూ. 1. ఉన్నవాఁడు. 11. ఏకః; ఏకాకీ(న్). 12. సక. పణ్ (1గ. పణతే-ణితుం-త); దివ్ (4గ. దీవ్యతి-వితుం-త). 13. చూ. 2. ఒగ్గు. 14. చూ. 3. ఒగ్గు. 15. చూ. అంకిలిపెట్టు. 16. చూ. 5. ఈఁదు.

**ఒడ్డుగుండ్లు.** చూ. 2. అచ్చనగండ్లు.

**ఒడ్డువిడుపు.** బాలక్రీడా విశేషః.

**ఒడ్డుఅకము.** నిమ్నోన్నతా-విషమా-ఉత్థాతినీ-భూమిః.

**ఒడ్డోలగము.** వి. మహాస్థానం; మహాసభా; ఆస్థానం.

**ఒత్తగిల్లు.** 1. అక. పార్శ్వభాగేన శీ (2గ. శేతే-శయితుం-త). 2. చూ. 4. అత్తమిల్లు. 3. సంజ్ (కర్మ. సజ్యతే); సక్తః-క్తా-క్తం-లగ్నః-భూ; లగ్ (1గ. లగతి-గితుం-గ్న).

**ఒత్తడము.** 1. వి. పీడనం; నిపీడనం; మర్దనం. 2. విణ. ఘనః-నా-నం; నిబిడః; సాంద్రః; నీరంధ్రః; శ్యానః; స్త్యానః.

**ఒత్తడి.** వి. 1. ఘర్షణం; మర్దనం; ఆఘట్టనం. 2. సాంద్రతా; నిబిడతా; నీరంధ్రతా. 3. చూ. 8. అంగడ.

**ఒత్తరము.** చూ. ఒడికారము.

**ఒత్తరించు.** సక. చూ. 2. అంగవించు. 2. చూ. 4. అప్పళించు.

**ఒత్తియాడు.** సక. చూ. ఒత్తు. (సక.)

**ఒత్తిలి.** అవ్య. 1. చూ. ఎత్తిలి. 2. ప్రయత్న పూర్వం.

**ఒత్తిలు.** చూ. 1. ఒత్తగిల్లు.

**ఒత్తు.** వి. 1. చూ. అదుముడు. 2. చూ. 2. ఒత్తడి. 3. శయ్యా; శయనం; పర్యం(ల్యం)కః; తల్పః; సంస్తరః; స్తరిమా(న్); శయనీయం; మంచః; ప్రస్తరః; ఆస్తరణం. 4. చూ. 2. అఱుము. 5. విణ. చూ. 2. ఒత్తడము. 6. సంయుక్తః-క్తా-క్తం; సంశ్లిష్టః; సంహతః; సంహితః; 7. అక. ప్రవిశ్ (1గ. విశతి-వేష్టుం-విష్ట); ప్రవేశం కృ; వేధనం కృ. 8. చూ. 1. ఒత్తగిల్లు. 9. ఘనీ భూ. నిబిడీ భూ; సాంద్రీ భూ. 10. సక. చూ. అదుము. 11. పాదాద్యుద్వర్తనం కృ. 12. చూ. 4. ఊఁదు. 13. బలాత్కారం కృ. 14. చూ. 6. అప్పళించు. 15. అపసృ (ప్రే. సారయతి); బహిష్కృ. 16. యుజ్ 7గ. యునక్తి-యుంక్తే-యోక్తుం-యుక్త-(ప్రే. యోజయతి)-సంధా (3గ. దధాతి-ధాతుం-హిత); సంశ్లిష్ (ప్రే. శ్లేషయతి). 17. చూ. 4. అప్పళించు. 18. చరణాభ్యాం ఉపమృద్ (9గ. మృద్నాతి-మర్దితుం-మృదిత); పాదన్యాసం కృ; క్రమ్ (1గ. క్రామతి-క్రమతే-మితుం-క్రాంత).

**ఒత్తుకాఁడు.** వి. సంగీతే కేనాపి వాద్యేన అనుశ్రుతి నిర్వాహకః.

**ఒత్తుకొను.** 1. అక. చూ. 7. ఒత్తు. 2. సక. చూ. 4. అప్పళించు. 3. అక. మార్గాత్ అపసృ. (1గ. సరతి-ర్తుం-సృత).

**ఒత్తుడు.** వి. 1. చూ. అదుముడు. 2. లేఖనాది సమయే పత్రాధః నిక్షిప్తం ఫలకాదికం.

**ఒత్తులు.** వి. హస్తభూషా విశేషః.

**ఒత్తుపడు.** అక. పీడితః-తా-తం-మర్దితః-క్లిష్టః-భూ.

**ఒత్తెడుపిల్లి.** వి. గంధమార్జాలః; గంధోతుః; ఖట్టాశః-శీ-; పూతిశారిజా; కస్తూరిమృగః.

ఒత్తొరవు. వి. చూ. అదుముడు.
ఒదరు. అక. 1. చూ. 6. అడరు. 2. చూ. 2. అగడుపడు. 3. సక. చూ. ఆడిపోసికొను.
ఒదరుచు. సక. విశ్లిష్ (ప్రే. శ్లేషయతి).
ఒదలు. అక. చూ. 5. అడరు.
ఒదవు. అక. చూ. 9. అడరు. 2. చూ. అవటిల్లు. 3. చూ. 4. అత్తు.
ఒదవుబడి. 1. వి. ఉపయోగః; ప్రయోగః; వ్యవహారః. 2. విణ. ప్రయుక్తః-క్తా-క్తం; ఉపయుక్తః; ఉపభుక్తః.
ఒదిగిలు. అక. చూ. 1. ఒత్తగిల్లు.
ఒదిగిళ్లు. వి. పార్శ్వేన శయనం.
ఒదివిరిప్రాలు. వి. శాలివిశేషః
ఒదుఁగబాఁఱు. అక. చూ. ఉజ్జగిల్లు.
ఒదుఁగు. అక. చూ. పై.
ఒదుగు. 1. వి. చూ. 5. ఆమని. 2. విణ. సమృద్ధః-ద్ధా-ద్ధం; పరిపూర్ణః; స్ఫీతః; ఉపచితః; వివృద్ధః. 3. అక. ఋధ్ (4గ. ఋధ్యతి-5గ. ఋధ్నోతి-అర్ధితుం-ఋద్ధ) సమృద్ధః-ద్ధా-ద్ధం భూ; వృధ్ (1గ. వర్ధతే-ర్ధితుం-వృద్ధ).
ఒదుగువడి. చూ. 5. ఆమని.
ఒదుఁగువడు. అక. చూ. ఉజ్జగిల్లు.
ఒదుఁగువాటు. వి. అపసరణం; అపసృతిః (స్త్రీ).
ఒదువు. 1. వి. చూ. 5. ఆమని. 2. విణ. చూ. 2. ఒదుగు. 3. అక. చూ. 3. ఒదుగు 4. చూ. 4. అడరు.
ఒద్ద. చూ. 2. అంచ.
ఒద్దిక. 1. వి. చూ. 3. అంటు. 2. ప్రతిమానం.
ఒద్దియ. వి చూ. 5. ఆమని.
ఒనగూడు. అక. చూ. 4. అమరు.
ఒనబెట్టు. వి. గూఢనివాసః; గూఢస్థితిః.
ఒనరించు. ప్రే. కృ. (8గ. కరోతి-కురుతే-కర్తుం-కృత); విధా (3గ. దధాతి-ధాతుం-హిత); అనుస్థా (1గ. తిష్ఠతి-స్థాతుం-స్థిత).
ఒనరిక. వి. చూ. 3. అంటు.
ఒనరు. 1. వి. చూ. 2. అంగము. 2. చూ. 3. అంటు. 3. చూ 3. ఆరజము. 4. అక. చూ. 3. అడరు. 5. చూ. 8. అడరు. 6. చూ. 4. అత్తు.
ఒనరుచు. ప్రే. చూ. ఒనరించు.
ఒనరుపడు. అక. చూ. అవటిల్లు.
ఒనరుపెట్టుకొను. అక. చూ. పై.
ఒనవెట్టు. చూ. ఒనబెట్టు.
ఒప్పగించు. సక. చూ. అప్పగించు.
ఒప్పగింత. చూ. అప్పగింత.
ఒప్పందము. వి. అంగీకృతః నిర్ణయః; అంగీకారః; వ్యవస్థా.
ఒప్పన. చూ. 2. అప్పన.
ఒప్పనము. చూ. పై.
ఒప్పనసేయు. చూ. 1 అప్పగించు.
ఒప్పమి. చూ. 3. అఖ. 2. చూ. అయివు.
ఒప్పరము. వి. ఉపకుల్యా; ప్రణాలః-లీ; ఖల్లః; జలనిర్గమః; సారణిః (స్త్రీ).
ఒప్పరికము. చూ. 5. అలవోక.
ఒప్పరికించు. సక. ఉపేక్ష్ (1గ. ఈక్షతే-క్షితుం-త); అవజ్ఞా (9గ. జానాతి-జ్ఞాతుం-త).
ఒప్పాచారము. చూ. 3. ఒడఁబడిక.
ఒప్పారు. అక. చూ. 3. అడరు.
ఒప్పించు. సక. చూ. అప్పగించు.
ఒప్పికోలు. చూ. అప్పగింత.
ఒప్పిదము. వి. 1. చూ. 2. అంగము. 2. చూ. 1. అంగము. 3. చూ. 1. ఒడమి.
ఒప్పు. వి 1. ద్యుతిః (స్త్రీ); దీప్తిః (స్త్రీ); జ్యోతిః (న్.న.); రుచిః (స్త్రీ); ప్రభా; ఉజ్జ్వలతా; ఛవిః (స్త్రీ); కాంతిః (స్త్రీ); తేజః (స్.న); శోభా. 2. కుశలతా; నైపుణ్యం; పటుతా; పాటవం; చతురతా

విజ్ఞతా; వైదగ్ధ్యం. 3. చూ. ఇచ్చగింత. 4. చూ. 2.అంగము. 5.సమ్యక్త్వం; నిర్దుష్టతా; శుద్ధతా; 6. అక. యుక్తః-క్తా-క్తం-నిర్దుష్టః - అనురూపః - అనుగుణః-ణా. 7. చూ. 4. అత్తు. 8. అంగీకృ (8గ. కరోతి - కురుతే - కర్తుం - కృత); అభ్యుపగమ్ (1గ. గచ్ఛతి-గంతుం-గత). 9. చూ. 3. అదరు.

**ఒప్పుకొను.** చూ. ఇచ్చగించు.

**ఒప్పుకోలు.** చూ. ఇచ్చగింత.

**ఒప్పులకుప్ప.** సౌందర్యరాశిః (స్త్రీ పుమాన్ వా).

**ఒప్పులాఁడి.** 1. వి. సుందరీ; సౌందర్యవతీ. 2. చూ. అలివ.

**ఒప్పులు.** వి. క్రముకభేదః.

**ఒబ్బట్లు.** వి. భక్ష్యవిశేషః.

**ఒబ్బిడి.** వి. 1. సస్యధాన్యసంచయః; కలమాదికణిశేభ్యః అవఘాతాదినా ధాన్యవిభాజనం. 2 క్షయః; హానిః; (స్త్రీ) అపచయః; నాశః; అపచితిః (స్త్రీ); ధ్వంసః.

**ఒమ్మచ్చు.** వి. మణిస్థగనార్థం నిర్మితం సౌవర్ణం సీసం.

**ఒమ్మమి.** వి. చూ. 3. అంకపొంకములు.

**ఒమ్మిక.** వి. చూ. 3. అంటు.

**ఒమ్మ.** 1.విణ.చూ.6ఒద్దు. 2.వి. చూ.అలవు. 3. అక. చూ. అవటిల్లు. 4. సక. చూ. అరికట్టు.

**ఒయారము.** వి. 1. చూ. 1.అదటు. 2.చూ. 3. అగ్గలిక. 2. చూ. 2. అంగము.

**ఒయారి.** 1.చూ. ఎమ్మెలాడి. 2. చూ. అందగత్తియ.

**ఒయారికత్తె.** చూ. పై.

**ఒయారికాఁడు.** చూ. అందగాఁడు.

**ఒయ్య.** క్రివిణ. 1.సద్యః; ఆశు. 2.మందం; శనైః (అవ్య.)

**ఒయ్యన.** చూ. అల్లన.

(8)

**ఒర.** 1. చూ. 3. అనుగలము. 2.చూ.ఒత్తడి.

**ఒరగట్టు.** వి. వస్త్రవేష్టనం.

**ఒరగడుగు.** వి. ద్వితీయవారం తండులక్షాలనోపయుక్తం జలం.

**ఒరగఁబడు.** అక. చూ. 4. అత్తమిల్లు.

**ఒరగల్లు.** వి. నికషః; కషః; శాణః - నః; హేమలః; నికషగ్రావా(న్.పుం.)

**ఒరగు.** వి. 1. చూ. అసదుబిల్ల. 2. చూ. 1. ఈచ. 3. విణ. వక్రః - క్రా - క్రం; కుటిలః; అనృజుః. 4. అక. చూ. 4.అత్తమిల్లు.

**ఒరగుబిల్ల.** చూ. అసదుబిల్ల.

**ఒరగువోవు.** చూ. 4. అత్తమిల్లు.

**ఒరగొడ్డెము.** చూ. 1. ఒద్దారము.

**ఒరగొను.** సక.ఘృష్(1.గ.ఘర్షతి-ర్షితుం-ఘృష్ట) (సువర్ణాదికం)

**ఒరచాలుదుక్కి.** వి. నాతిగభీరసీతా హలకృష్టిః.

**ఒరపదను.** వి. ఈషదార్ద్రితా.

**ఒరపిడి.** వి. చూ. 1. ఒత్తడి.

**ఒరపెట్టు.** సక. చూ. ఒరగొను.

**ఒరయిక.** వి.చూ. 1. ఒత్తడి.

**ఒరయు.** 1. సక. చూ. ఒరగొను. 2. పరీక్ష్ (1గ. ఈక్షతే - క్షితుం - క్షిత) నిరూప్ (10గ. రూపయతి-యితుం-పిత). 3-4. చూ. 1-2. అరయు.

**ఒరలుట.** చూ. అఱుట.

**ఒరవడి.** వి. బాలానాంలేఖనార్థం ఉదాహరణతయా గుర్వాదిభిః లిఖితా అక్షరపంక్తిః.

**ఒరసికొనిపోవు.** అక. ఘృష్(1గ.ఘర్షతి - ర్షితుం - ఘృష్ట); ఘర్షణేన క్షి (కర్మ. క్షీయతే).

**ఒరిగ.** వి.చూ. ఎరగుడు.

**ఒరిజ(జె).** వి. గజకంఠ శృంఖలా.

**ఒరిమ.** వి. 1. చూ. 3. అంటు. 2. ఐకమత్యం; సంహతిః(స్త్రీ).

కవణము. వి. ఖాద్యం; గజాది గ్రాసః.
కవను. వి. తృణం; శష్పం; బాలతృణం; ఘాసః; యవసః; జవసః; శాదః; అర్జునం-నీ; ఖటః; ఖేటం.
కవపులుఁగు. వి. కోకః; చక్రః; చక్రవాకః; రథాంగాహ్వయః-నామకః.
కవపుల్గుదాయ. వి. మా. ఎదగండు.
కవయుట. వి. మా. 2. కలియిక.
కవఱలు. వి. మా. అడ్డపాళులు.
కవలవారు. వి. యమలౌ(ద్వి.వ); యమౌ (ద్వి.వ); యమకౌ (ద్వి.వ); యమం; యమలం; ద్వంద్వం; యుగలం; యుగం.
కవలి. వి. మా. 3. ఉద్ది.
కవలు. 1. వి. కుశలవౌ. 2. నకులసహదేవౌ. 3. వేదాదిపఠనే సామ్యవశేన ఏకస్మిన్ వాక్యే అన్యవాక్యస్థ పదసమావేశః.
కవలుకొను. అక. వేదాదిపఠన సమయే సామ్యవశేన ఏకస్మిన్ వాక్యే వాక్యాంతరస్థం పదం సమావిశ్ (6గ. విశతి-వేష్టుం-విష్ట).
కవలువోవు. అక. మా.
కవించు. ప్రే. ప్రసృ (ప్రే. సారయతి); ప్రసృప్ (ప్రే. సర్పయతి); విస్తౄ (ప్రే. స్తారయతి).
కవిచేయు. అక. మా. 4. అడరు.
కవిడి. వి. చర్మవాద్య విశేషః;
కవియు. అక. మా. 4. అడరు.
కవియుదెంచు. అక. మా. సై.
కవిరి. వి. తాంబూలే ఉపయుజ్యమానః పూగీఫలనిర్యాసః.
కవిల. వి. కపిలః; కడారః; పింగః; పిశంగః; కద్రుః; పింగలః; అరుణః; పింజరః.
కవిలియ. వి. మా. కదితము.
కవిలె. మా. సై.

కవు. కరిరార్థస్య 'కాను' శబ్దస్య వృత్తౌ రూపం.
కవుగిలి. వి. క్రోడః; కోలః; భుజాంతరం.
కవుఁగులించు. మా. 8 అలము.
కవుఁగిలింత. వి. ఆలింగనం-గితం; ఆశ్లేషః; సంశ్లేషః; శ్లేషః; పరిష్వంగః; పరిరంభః; ఉపగూఢం; ఉపగూహనం; అవగాహనం; అంకపాలీ-లికా; అంగపాలిః (పుం); శ్లిషా; లీః (స్త్రీ); అంకః; కోలః; లయః; క్రోడీకరణం; క్రోడీకృతిః (స్త్రీ).
కవుఁగిలింపు. మా. సై.
కవుచు. వి. 1. మా. అరుచి. 2. మత్స్య చర్మరేణుః (పుం. స్త్రీ).
కవుజు. మా. కంజు.
కవుదు. వి.1. మా. ఉక్కివము. 2.మా. 4. అటమట.
కవుదువు. మా. 1. కయివడి.
కవును. వి. 1. మధ్యః-ధ్యం; మధ్యమః-మం; మధ్యస్థలం; అవలగ్నః-గ్నం; విలగ్నః-గ్నం; ఉద్దానం; కటిదేశః; కటితటం; కటిః (పుం)-టీ. 2. మా. అరుచెప్పులు. 3. చాపమధ్యం; లస్తకః; ధనుర్మధ్యం.
కవురు. వి. వర్ణాధిక్యం.
కవులు. వి. రాజాదిభిః ప్రజాదిభిః సాకం (భూమ్యాదివిషయే) కృతః సమయః.
కవ్వడి. మా. 2. కట్టి.
కవ్వంపుమల. వి. మందరః; మంథాద్రిః (పుం).
కవ్వపుఁగొండ. వి. మా. సై.
కవ్వంపుమలతరిత్రాడు. వి. శేషః; ఆదిశేషః; నాగాధిపః; సహస్రఫణీ (న్); అనంతః.
కవ్వము. వి. మంథః; మంథా (మథిన్. పుం); మంథదండకః; మంథానః; దధిచారః; వైశాఖః; ఖజకః.

**ఒలివడు.** అక. అపహృతధనః-నా-నం-అపహృతస్వః-భూ.

**ఒలుకు.** అక. 1. చూ. 2. అగులు. 2. చూ. 2. ఉట్టు. 3. సక. సిచ్ (6 గ. సించతి-సేక్తుం-సిక్త); అవకౄ (6 గ. కిరతి-కరితుం-రీతుం-కీర్ణ); ఉక్ష్ (1గ. ఉక్షతి-క్షితుం-త). 4. స్రు. (ప్రే. స్రావయతి.); నిఃసృ (ప్రే. నిస్సారయతి). 5.పత్(ప్రే. పాతయతి); వృష్(1.గ. వర్షతి-ర్షితుం-వృష్ట).

**ఒలుకులమిట్ట.** చూ. ఒలికి.

**ఒలుపు.** చూ. ఒలి.

**ఒలె.** వి. పటః; వస్త్రం; వానః; వాసః(స్‌.న); వసనం; చేలః-లం; చైలం; అంశుకం; ఆచ్ఛాదనం; ప్రోతం.

**ఒలెవాటు.** స్కంధేతిర్యక్నిక్షిప్తం శృంగారోత్తరీయం.

**ఒల్ల.** క్రి. విఱ. అలసం; మందం; మంథరం.

**ఒల్లగిల్లు.** అక. అనాదృతఃభూ.

**ఒల్లన.** చూ. 1. అల్లన.

**ఒల్లబాటు.** వి. 1. నిరీహతా; అనపేక్షతా; విరాగః; 2. విఱ. అనపేక్షితః-తా-తం; అనభిలషితః; అనభీష్టః.

**ఒల్లఁబోక.** వి. 1. అనాదరః; అనపేక్షా. 2. విస్మృతిః (స్త్రీ); విస్మరణం; స్మృతిభ్రమః. 3. చూ. 2. అక్కసము.

**ఒల్లఁబోవు.** అక. చూ. ఒల్లగిల్లు. 2. వ్యథ్ (1గ.వ్యథతే - థితుం-థిత) క్లిశ్ (4గ. క్లిశ్యతే-క్లేష్టుం - క్లిష్ట); ఖిద్ (4 గ. ఖిద్యతే-ఖేదితుం-ఖిన్న). 3. చూ. ఎడజెందు.

**ఒల్లమి.** వి. 1. చూ. 1 ఒల్లఁబాటు 2. చూ. 3. అంకపొంకములు.

**ఒల్లము.** చూ. అరసావు.

**ఒల్లియ.** వి. 1. చూ. ఒలె. 2. చూ. ఉత్తరిగము.

**ఒల్లె.** చూ. పై.

**ఒల్లెంక.** వి. మత్స్యవిశేషః.

**ఒల్లెచీర.** వి. శుక్లారుణతంతు నిర్మితం వసనం యద్ గర్భిణీభిః పరిధీయతే.

**ఒల్లెవాటు.** చూ. ఒలెవాటు.

**ఒళగు.** వి. వీణాదండః.

**ఒళరు.** వి. చూ. అయివు.

**ఒళవరి.** వి. మర్మజ్ఞః; రహస్యవిద్.

**ఒళవు.** వి. 1.వీణాదండః. 2. చూ.అనరులు. 3. చూ. 2. అంకియ.

**ఒళ్లము.** చూ. ఎళ్లము.

**ఒళ్లు.** వి. చూ. ఒడలు.

**ఒళ్లుపెట్టు.** అక. స్థూలః- లా-లం - పీవరః - పీనః-భూ.

**ఒవ్వమి.** వి. అనంగీకారః-కృతిః(స్త్రీ); అనభ్యుపగమః.

**ఒవ్వు.** అక. చూ. ఆవటిల్లు.

**ఒసఁగు.** 1. వి, చూ. 1. ఈగి. 2. ఉపాయనం; ఉపదా; ఉపహారః; ప్రీతిదానం; పారితోషికం; ప్రాభృతం. 3. సక. చూ. 8. అచ్చు.

**ఒసపరి.** 1. చూ. అందగాడు. 2.చూ.5.అగ్గలిక.

**ఒసవు.** చూ. 8. అచ్చు.

**ఒసి.** అవ్య. హాంజే!

**ఒహో.** చూ. 3. అల.

## ఓ

**ఓ.** అవ్య. సంశయా, హ్వానా, ఖ్యావా, ప్రార్థనా, ప్రశ్న, సంబోధనార్థే విక్రయకాద్యర్థేషూపయుజ్యతే.

**ఓంద్ర.** వి. గర్దభరావః; చీత్కారః; ఖరనాదః.

**ఓండ్రించు.** అక. (గర్దభః) రు(2గ. రౌతి-రవితుం-రుత)-నద్ (1గ.నదతి - దితుం-దిత); చీత్కారంకృ.

**ఓంక.** వి. (వృక్షవిశేషః.) కరమందీ; క్షీరఫలా; సామ్లపుష్పఫలా.

**ఓకర.** వి. వమనం; వమః; వమథుః (పుం.) వాంతిః (స్త్రీ); ఛర్దనం; ఛర్దికా; ఉత్క్షేపః- పణం, ఉద్గమః; ఊర్ధ్వశోధనం, 2. చూ. అగడారు.

**ఓకరించు.** అక. వమ్ (1గ. వమతి-మితుం-వాంత). ఛర్ద్ (10గ.-ఛర్దయతి-యితుం-ర్దిత); ఉద్గౄ (6గ. గిరతి - గరితుం - గీర్ణ); ఉద్గమ్ (ప్రే. గమయతి) 2. చూ. అనహ్యావడు.

**ఓకరింత.** వి. 1. చూ. అగడారు. 2. చూ. 1. ఓకర.

**ఓకలింత.** వి. చూ. ఓకరింత.

**ఓంకలివె.** చూ. ఓంక.

**ఓకిలి.** వి. చూ. 1. ఓకర.

**ఓకిలించు.** చూ. ఓకరించు.

**ఓకిలింత.** వి. చూ. ఓకరింత.

**ఓగాత్యము.** వి.అమంగలం;అశ్లీలః;అశుభం.

**ఓగితము.** చూ. 8. ఒజవు.

**ఓగిరము.** వి. భోజనం; ఆహారః; భోజ్యం; ఖాద్యం; అన్నం; అద్యం; అదనం; ఖాదనం: ఆహార్యం; ఆమిషం; జగ్ధిః (స్త్రీ); అశనం, చామ్యం; జేమనం; జమనం; చరః (స్.న); ఘసిః (పుం.); గ్రాసః; ప్సానం; ఆశః; స్వాదః.

**ఓగు.** 1. వి. చూ. 3.అలు, 2. విశ. అశుభః-భా-భం; అమంగలః; అనర్థకరః. 3. వి. చూ. ఉక్కిఁడు.

**ఓగులాడుచు.** అక. దీనః-నం-దైన్యవాన్-వతీ-వత్-భూ.

**ఓచెల(ల్ల).**అవ్య. బత (అవ్య)హంత(అవ్య)

**ఓజ.** వి. 1.చూ. అంజిక. 2. స్వభావః; ప్రకృతిః (స్త్రీ);నిసర్గః; స్వరూపం;స్వధర్మః; ధర్మః; 3. చూ. 1. అయగారు. 4. చూ. అప్పణ. 5 చూ. 1. అంగము. 6. చూ. 2. ఉద్దవడి, 7 చూ. 3. అంగద.

**ఓజపడు.** అక. క్రమనివిష్టః-ష్టా-ష్టం-భూ.

**ఓజ బంతి.** భూ. ఒజ్జ బంతి.

**ఓజు.** చూ. అగసాలి.

**ఓటు.** వి. 1. చూ. అంజిక, 2. చూ. 3. అరవాయి.

**ఓటమి.** వి. చూ. అంజిక. 2. చూ. 4 ఎడరు.

**ఓటము.** చూ. ఇలుగుట.

**ఓటలు.** అక. నిస్సత్త్వః- త్త్వా- త్త్వం- దుర్బలః-భూ.

**ఓటాలు.** అక. చూ. పై.

**ఓటి.** వి. విముఖతా; వైముఖ్యం; పరాఙ్ముఖతా.

**ఓటిల్లు.** అక. చూ. 2. అరవాయిగోను.

**ఓటిల్లుచిందఱ.** వి. బాలక్రీడావిశేషః.

**ఓటు.** వి. చూ. ఇలుగుట. 2. భంగః; పరాభవః. 3. ప్రశ్నార్థకం అవ్యయం.

**ఓటుపడు.** 1. అక. జితః-తా-తం-పరాభూతః-పరాహతః-పరాస్తః - కృతధ్వంసః భూ, 2. ప్రమద్ (4గ. మాద్యతి-మదితుం, మత్త); ప్రమత్తః-త్తా- త్తం-అనవహితః-వంచితః-భూ.3.సక.భ్రంశ్ (4గ. భ్రశ్యతి-భ్రంశితుం-భ్రష్ట) చ్యు (1గ. చ్యవతి-చ్యోతుం-చ్యుత);వియుజ్ (కర్మ. యుజ్యతే) (ఇదం ధాతుత్రయం పంచ

మ్యం తేనసహ ప్రయుజ్యతే, యథా "రాజ్యాత్ భ్రశ్యతి, చ్యవతే, వియుజ్యతే" ఇత్యాది; హా (2గ. జహాతి-హాతుం-హీన) త్యజ్ (1గ. త్యజతి-క్తుం-క్త).
**ఓటుపాటు.** వి. పరాజయః. 2. ప్రమాదః. 3. ప్రభ్రంశః.
**ఓటుపుచ్చు.** ప్రే. చూ. 3. ఓటుపడు
**ఓటుపోవు.** సక. చూ. 3. ఓటుపడు.
**ఓటుసేయు.** సక. భంజ్. (ప్రే. భంజయతి). నిరర్థకం-కాం-కం-పరాజితం-కృ.
**ఓడ.** వి. నౌః (స్త్రీ); నౌకా, పోతః-తరణిః-ణీ (స్త్రీ); అర్ణవయానం, జలయానం; వోహిత్థం; మద్గుః (పుం.); ప్లవః, వాహోడః.
**ఓడంగి.** వి. 1. చూ. అరకాటి. 2. నౌకాధస్తలదారుస్థూణా.
**ఓడవాండు.** చూ. అరకాటి.
**ఓడించు.** సక. జి.(1గ.జయతి_జేతుం-జిత); పరాజి, అభిభూ (1గ. భవతి-వితుం-భూత) పరాహన్ (2గ. హంతి_హంతుం-హత); పరాస్ (4గ. అస్యతి-సితుం-స్త).
**ఓడిక.** వి. 1 చూ. ఒప్పరము. 2. చూ. అంపాచారము.
**ఓడిగిల్లు.** అక. 1. స్రు (1గ. స్రవతి-స్రోతుం-స్రుత), స్యంద్ (1గ. స్యందతే-దితుం-త); సృ (1గ. సరతి-సర్తుం-స్మృత, ప్రవహ్ (1గ. వహతి-వోఢుం-ఊఢ). 2. చూ. 2. ఉఱుకు 3. చూ. 2. ఉట్టు.
**ఓడినక్క.** వి. హ్రస్వజంబూకః వామనజంబూకః
**ఓడు.** వి. 1. చూ. ఇఱుగుట. 2. ఘటాది రంధ్రోద్గతా ధారా. 3. అక. చూ. 1. అయిదుపదిచేయు. 4. చూ. 2.ఉఱుకు. 5. చూ. అంజు.6. చూ.2. అరవాయిగొను.
**ఓడుబిల్ల.** వి. (గృహాచ్ఛాదనార్థం) పక్వేష్టికా; పక్వమృత్తికా ఫలకః
**ఓణి.** వి. చూ. ఉత్తరిగము.
**ఓదము.** వి. చూ. ఒగ్గము.
**ఓదారుచు.** సక. చూ. ఊరాఱుచు.
**ఓదియ(దె).** వి. తత్రతత్ర రాశీకృతం ఛిన్నసస్యం.
**ఓదెకొంగ.** వి. బకవిశేషః.
**ఓదెకొఱకు.** చూ. పై.
**ఓనికట్టు.** వి. పర్వతమధ్యసంకటమార్గః.
**ఓపమి.** వి. ఆలస్యం; అలసతా; మాంద్యం; అనుద్యోగః; ఉద్యోగద్వేషః; ఉత్సాహవిముఖతా; అవ్యవసాయః; కుంఠతా; జడతా; తంద్రితా; తంద్రాలుతా; తంద్రా.
**ఓపిక.** వి. 1. చూ. 2. అలవు. 2. చూ. అడకర.
**ఓపు.** 1. వి. చూ. పై. 2. అక. సమర్థః-ర్థా-ర్థం శక్తః-అలం-భూ. కప్ (1గ. కల్పతే-కల్పితుం-క్లప్త)
**ఓపువాండు.** చూ. అరుహుండు.
**ఓపె.** స్త్రీ సంబోధన బోధకం అవ్యయం.
**ఓమటి.** చూ. ఓగిరము,
**ఓమనగాయలు.** వి. క్రీడావిశేషోపయుక్తాని తింత్రిణ్యాది బీజాని.
**ఓమనగంటలు.** వి. బాలక్రీడావిశేషః.
**ఓమనపేట.** వి. పూర్వోక్తక్రీడోపయుక్తదారుఫలకం.
**ఓమము.** వి. దీప్యః; ఖరాశ్వా; కారవీ; మయూరః; లోచమస్తకః.
**ఓము.** సక. చూ. 2. ఏదు.
**ఓమె.** అవ్య. చూ. ఓపె.
**ఓయన.** చూ. అల్లన.
**ఓయారము.** వి. 1. చూ. 2. అంగము. 2. చూ. 3. అగ్గలిక.
**ఓయారి.** చూ. ఒయారి.
**ఓయి(యీ).** పురుషసంబోధకం అవ్యయం.
**ఓయిరము.** చూ. ఓగిరము
**ఓర.** వి. చూ. ఎడగడ్డ 2. చూ. 1. అంచు. 3. అవ్య. తిర్యక్; సాచి (అవ్య). 4. అ

హో రాత్రం; రాత్రిందివం. 5.చూ.1.అంక
6. విణ.నతః-తా-తం; భుగ్నః;అవనతః.
**ఓరంతపొద్దు.** 1.వి.సకలందినం; 2.సర్వదా; సదా; (అవ్య.).
**ఓరగిల్లు.** అక. 1. చూ. ఉజ్జగిల్లు. 2. చూ. 4. అత్తమిల్లు.
**ఓరచూపు.** వి. వక్రదృష్టిః (స్త్రీ); తిర్యగ్దృష్టిః; సాచీకృతదృష్టిః.
**ఓరచుప్పలు.** వి. మధ్యాహ్న తేపాదుకే.
**ఓరణము.** వి. శ్యేనవిశేషః.
**ఓరపాక.** వి. భిత్త్యధోనిర్మితం గృహం.
**ఓరపాటు.** వి. అవనతిః (స్త్రీ); పార్శ్వనతిః.
**ఓరపారము.** వి. న్యూనాధికతే (స్త్రీ).
**ఓరవలి.** వి. చిత్రవర్ణంవస్త్రం.
**ఓరవోవు.** అక. చూ. 4. అత్తమిల్లు.
**ఓరసింపు.** వి. అపసరణం; దూరతోగమనం.
**ఓరసిల్లు.** అక. చూ. ఉజ్జగిల్లు.
**ఓరె.** నీచసంబోధకం అవ్యయం.
**ఓరెమి.** చూ. అడకర.
**ఓరీ.** చూ. ఓరె.
**ఓరు.** వి. 1. భిత్తికోణాదివిలిప్తా రక్తమృత్తికాలేఖా. 2. 'ఉరు' పదార్థకః ఉపసర్గః.
**ఓరుగాలి.** వి. ప్రకంపనః; ఝంఝూవాతః; ప్రభంజనః; వాత్యా; ఝంఝా; భ్రమిః (పుం).
**ఓరుచు.** అక.క్షమ్ (1గ. క్షమతే-తి-క్షంతుం-క్షాంత);మృష్ (4గ.మృష్యతి-మర్షితుం-మర్షుం-మృష్ట - 10గ. మర్షయతి) 2. సహ్ (1గ. సహతే-సోఢుం-సోఢ);క్షమ్; తిజ్ (సన్నంత. తితిక్షతే).
**ఓర్చు.** చూ. పై.
**ఓరుతీయు.** అక. గృహాలింద భిత్త్యాదికోణేషు రక్తమృదా లేఖాదికం కృ.
**ఓరుపరి.** విణ. సహిష్ణుః-ష్ణుః-ష్ణు; సహనః క్షమావాన్-వతీ-వత్; తితిక్షుః-క్షుః-క్షు; మర్షణః; క్షాంతః; సాసహిః-హిః-హి.
**ఓరెము.** చూ. ఓగిరము.
**ఓర్పరి.** చూ. పై.
**ఓరుపు.** వి. 1. చూ. అడకర. 2. విజయః, జయః; జయశ్రీః (స్త్రీ).
**ఓర్పు.** చూ. పై.
**ఓర్వమి.** చూ. 1. ఈరస.
**ఓర్త.** చూ. ఒకత.
**ఓర్తి.** చూ. పై.
**ఓలు.** వి. 1.చూ. అలికిడి. 2. వర్ష వాతాది ధ్వనిః(పుం).
**ఓల.** వి. 1. జల విహారధ్వనిః(పుం); 2.చూ. 2. ఈల. 3. చూ. ఇలుగుట.
**ఓలగందము.** వి. అంగరాగః; అంగరాగోపయుక్తా హారిద్రా.
**ఓలగము.** వి. 1. ఆస్థానం-నీ; రాజసభా; రాజశాలా. 2. చూ. 3. అంగడి.
**ఓలగించు.** సక. సేవ్.(1గ. సేవతే-వితుం-త); ఉపాస్ (2 గ. ఆస్తే-సితుం-సిత). శ్రు (సన్నంత. శుశ్రూషతే); ఉపస్థా (1గ. తిష్ఠతి-స్థాతుం-స్థిత); ఉపచర్(1గ చరతి-రితుం-రిత).
**ఓలచెంగనాలు.** వి. చూ. ఇలుగుట.
**ఓలమానగొను.** అక. చూ. ఇలుముకొను.
**ఓలము.** వి. 1. చూ. 2. అడ్డపాటు. 2. చూ. ఒడలు. 3. వృక్షాదిభిః సంఛన్నం స్థానం 4. చూ. 2. అసలు.
**ఓలలాడు.** అక. 1.చూ. 5.అడు.2.ప్లు.(1గ. ప్లవతే-ప్లోతుం - ప్లుత) ఉన్మజ్జ్ (6 గ. మజ్జతి-మంక్తుం-మగ్న).
**ఓలలార్చు.** ప్రే. ప్లు (ప్రే. ప్లావయతి); ఉన్మజ్జ్(ప్రే.మజ్జయతి).
**ఓలాకు.** చూ. అతలకుతలము.
**ఓలాకుపడు.** అక. చూ. 2. అలంగు.
**ఓలాడు.** అక. చూ. పై.
**ఓలి.** వి. 1. చూ. ఉంకువ. 2. చూ.అంచెలు. 3. చూ. 2. ఉదంతడి.

ఓలిమి. వి. చూ. 2. అడ్డపాటు.
ఓవర. చూ. 4. అఱ.
ఓవరి. వి. 1. చూ.4. అఱ. 2.చంద్రశాలా; గృహోపరిగతాపవరకః.
ఓవు. అక. చూ. అవటిల్లు.
ఓసరింత. వి. చూ. ఓరసింపు.
ఓసరిలు(ల్లు). అక. 1. అల్పః- ల్పా-ల్పం- మందః-న్యూనః-భూ. 2. చూ.ఉజ్జగిల్లు.
ఓసరు. అక. చూ. పై.
ఓసి. చూ. ఒసి.
ఓహటము. వి. నివర్తనం; నివృత్తిః (స్త్రీ); పరిహరణం; సంయమః;.
ఓహటించు. అక. చూ. 1. అయిదువదిచేయు.
ఓహటిల్లు. చూ. పై.
ఓహరి. వి. అహమమికా; అహంపూర్వికా.
ఓహరిసాహరి. చూ. పై.
ఓహరిసాహరిన్. క్రివిణ.సంఘుళః (అవ్య.).
ఓహో. సంభోధన ప్రశంసా ప్రత్యుత్తరదానాది సూచకం అవ్యయం.
ఓహోరె(రే). అవ్యా. అహో! (అవ్యా.); అహాహా; హంత; అహోవత్.

## ఔ

ఔ. అక. చూ. అగు.
ఔన్. 1. అవ్యా. చూ. అగున్. 2. చూ. అహో! (అవ్యా.).
ఔకాఁపు. చూ. అవుకాఁపు.
ఔఁగదే. అవ్యా. అహో!; అహాహా. హంత.
ఔఁగాక. అవ్యా. 'తథాస్తు.' -
ఔగాములు. చూ. అవుగాములు.
ఔజు. చూ. 2. 3. అవుజు.
ఔటుగుండు. వి. ఆయుధోపయుక్తః అయోగోలః.
ఔడు. వి. చూ. అవుడు.
ఔదరి. వి. చూ. 2. అవుజు;
ఔదల. వి. 1. చూ. అవుదల 2. చూ. ఉచ్చి.
ఔదు. చూ. ఔజు.
ఔను. అవ్యా. చూ. అగుఁబొమ్మ.
ఔర (రా). అవ్యా. చూ. 4. అక్క.
ఔరు. వి.వీరణాఖ్యః తృణవిశేషః సుగంధిః.
ఔల. వి. చూ. 2. అక్కడ.
ఔలు. అక. చూ. 2. అగులు.
ఔలెమ్మ. చూ. అవులెమ్మ.
ఔలే. చూ. పై.
ఔసు. వి. చూ. అవుసు.
ఔసుకాఁడు. చూ. అందగాఁడు.

## క

కంకటి. వి. ఖట్వా; శయనం; మంచం; పర్యంకః.
కంకణము. వి. జలవిహాగవిశేషః
కంకణాయి. చూ. పై.
కంకర. వి. 1. కర్కరం; శిలాఖండః. 2. చూ. 2. ఈఱతాఱలు.
కంకరగాడిద. వి. అశ్వతరః-రా; వేశరః; వేసరః; ఖేసరః; ప్రఖరః; అతిభారగః; మయః; నిఘృష్వః.
కంకరి. వి. తేపవిశేషః.
కంకి. వి. కణిశః-శం; ధాన్యశీర్షకం; సస్యమంజరీ.
కంకు. 1. సక. శప్. (1గ. శపతి-తే-4గ. శప్యతి-పుం.-ప్త); ఆక్రుశ్ (1గ. క్రోశతి-క్రోష్టుం-క్రుష్ట); గర్హ్ (1గ. గర్హతే-ర్హితుం-త); ధిక్కృ; భర్త్స (10గ. భర్త్సయతి-యితుం-ర్త్సిత); 2.చూ.అఱలించు.
కంగటి. చూ. కంకటి.
కంగవ. వి. చూ. 2.ఇక్క

**కంగాణము.** వి. ఖలరక్షా.

**కంగారు.** వి. చూ. 1. అని.

**కంగాళము.** చూ. అనికి,

**కంగిస.** చూ. 1అని.

**కంగు.** వి. 1. సనేత్రాకారరంధ్రంతంతువయనం. 2.చూ.ఉంగ. 3. ధ్వని విశేషః (లోహాదీనాం).

**కంగేలి.** వి. అశోకః.

**కంగోరు.** వి. దీర్ఘశిరోధానం.

**కంగోరుపావడ.** చూ. పై.

**కంచము.** వి. 1. శాలాజిరః-రం; వైదలం; శరావః; పుటకః; పాత్రం. 2. భోజనశరావః.

**కంచర.** వి. కాంస్యకారజాతిః (స్త్రీ).

**కంచరగాడిద.** చూ. కంకర గాడిద.

**కంచరవాఁడు.** వి. కాంస్యకారః

**కంచరి.** చూ. పై.

**కంచి.** విణ. చూ.ఉక్కడము.

**కంచిమేఁక.** వి. అజావిశేషః, యస్యా ఊధః మహద్భవతి.

**కంచియ.** వి.1.గోచరః; శాద్వలం; వివీతం. 2. వృతిః (స్త్రీ);ఆవరణం;ప్రాచీరం; అవరోధకం; వేష్టః; ప్రావరః; వారణం-ణీ; స్తంభకరః; మత్తవారణం; గడః; నేమః; మోఘః; మోఘాలీ.

**కంచు.** వి. కాంస్యం.

**కంచుకంటు.** వి. కందుః (పుం. స్త్రీ.); ఆపాకః;ఉఖా.

**కంచుడమారము.** వి. 1. చూ. అరజుట్టు. 2. చూ. ఉడుపకుక్క.

**కంచుమించు** వి. 1. చూ. అడుజు. 2. విణ. అగోచరః-రా-రం; అవిషయః; అదృశ్యః; అలక్ష్యః.

**కంచె.** చూ. కంచియ.

**కంచెకోట.** వి. 2. కంచియ.

**కంచెగోడ.** వి. కంటకచితం కుడ్యం.

**కంచెల.** వి. కంచుకః; కంచులికా; నిచోలః-లకః; చోలః-లకః; నిచులః; అంగికా; కూర్పాసకః.

**కంజు.** వి. కపింజలః (చాతకః తిత్తిరిర్వా).

**కంటు.** వి.1.నాట్యబంధః.2.దర్శనం; దృష్టిః (స్త్రీ);అవలోకనం; ఆలోకనం; నిధ్యానం; ఈక్షణం;నిశామనం;నిర్వర్ణనం;నిభాలనం.

**కంటకము.** 1. వి. విరోధోక్తిః(స్త్రీ).2. విరుద్ధః-ద్ధా-ద్ధం; విపరీతః; ప్రతికూలః.

**కంటుగించు.** అక.1.చూ.3.ఈరసించు. 2.పీడ్ (కర్మ. పీడ్యతే); దుఃఖ్ (నామ. దుఃఖాయతే-దుఃఖయతి); దుఃఖార్తీభూ; వ్యథ్ (1గ.వ్యథతే-థితుం-త)తప్ (కర్మ.తప్యతే)క్లిశ్(4గ.క్లిశ్యతే-క్లేష్టుం- క్లిష్ట).

**కంటుగిల్లు.** చూ. 2. కంటుగించు

**కంటలము.** వి. 1. వృషభాది పృష్ఠనిక్షిప్తం గోణీద్వయం. 2. తూలబంధః.

**కంటసము.** వి. చూ. 1. కంటకము.

**కంటసరి.** వి. కంఠసరః (ఆభరణవిశేషః).

**కంటాణి.** వి. స్థూలసూచీ (పుస్తకాదిగ్రథనోపయుక్తా).

**కంటాళము.** వి. 1.చూ.పై.2. చూ.కంటలము

**కంటికలక.** వి.నేత్రరోగవిశేషః.2.చూ.అక్షి.

**కంటితుద.** వి. నేత్రాంతం; కటాక్షః.

**కంటిపాప.** వి. చూ. అక్షి.

**కంటియ.** వి.గ్రైవేయకం(ఆభరణవిశేషః).

**కంటివాలు.** వి. చక్రం (ఆయుధవిశేషః).

**కంటివిన్కరి.** వి. చక్షుఃశ్రవాః(స. పుం.); అహిః; భుజంగః; ఉరగః; వ్యాలః;నాగః; పన్నగః; సరీసృపః; బిలేశయః; అండజః; విషధరః; ఆశీవిషః; ద్విజిహ్వః; వాయుభక్షః; జిహ్మగః;కాకోదరః;కంచుకాలుః; గూఢపాత్(ద్);దందశూకః; పృదాకుః; సృదరః; సమకోలః; తృపూః (పుం); వాడః; ఫణాధరః; దర్వీకరః

**కంటీలు.** వి. చూ. 1. ఒంట్లు.
**కంటు.** వి.1. ఒంటనివాఁడు. 2.చూ.3. అంకపొంకములు.
**కంఠె.** వి. గ్రైవేయకం.
**కంట్లము.** చూ. కంటలము.
**కండ.** వి. చూ. అరుచి. 2. చూ. ఇసుకపుల కండము. 3. మాంసఖండః;
**కండకావరము.** వి. చూ. 1. అదటు.
**కండచక్కెర.** చూ. ఇసుకపులకండము.
**కండమక్క.** వి. కాలఖండం; కాలఖంజనం; యకృత్ (త్); కాలకం; కాలికా; కాలేయం; పిత్తాశయః; పిత్తాధారః.
**కండమక్క.** చూ. పై.
**కండిక.** వి. ఖండికా (భూప్రమాణవిశేషః).
**కండియ.** వి. తంతుశలాకా; పరివేష్టిత తంతుజాలం.
**కండు.** వి. 1. కండూతిః (స్త్రీ); కండూయనం; కండూయా. 2. చూ. 2. అంకిలి.
**కండువ.** చూ. ఉత్తరిగము.
**కండువా.** వి. 1. చూ. పై. 2. తిర్యగ్వేష్టిస్థానా.
**కండువాదూలము.** వి. చూ. 2. పై.
**కండె.** వి. 1.చూ. కండియ; జూర్ణకణిశః-శం. 3. వ్యాయామకర్కశం భుజాగ్రం.
**కండెము.** చూ. 3. కండె.
**కంద్రావి.** విశ. వ్యసనకరః-రీ-రం.
**కంతి.** వి. 1. వంశాదీనాం గ్రంథిః (స్త్రీ); మేదోర్బుదం; మేదోగ్రంథిః. 2. చూ. ఆణియ.
**కంతు.** వి. నిర్ణీతకాలః; సమయః.
**కంతుఁడు.** చూ. అంచయేనుఁగుమావంతు.
**కంద.** వి. కందః; సర్పనాలః; క్రూరకందా; దార్వీ; సూరణః.
**కందకము.** వి. చూ. అగడిత.
**కందణము.** వి. మల్లబంధవిశేషః.
**కందనగాయ.** వి. చూ. 1 ఆద.
**కందము.** వి. 1. స్కంధః (పశూనాం). 2. చూ. అరక.
**కందరము.** వి. అభ్రం; మేఘః; ఘనః; పర్జన్యః; వలాహకః; జీమూతః; జలధరః; పయోధరః; ధారాధరః; పయోదః; నీరదః; వారిదః; పాథోదః; వారివాహః; జలముక్ (చ్. పుం.); పయోముక్ (చ్. పుం.); తడిత్వాన్ (త్); స్తనయిత్నుః; ధూమయోనిః; జలమసిః; నభోదుహః; నభోగజః; పారణః; వాసవః; ముదిరః; దర్దురః; ఉరణకః; నభ్రాట్ (జ్. పుం).
**కందరిక.** వి. వృషభపృష్ఠనిఊప్తాకంథా.
**కందళము** } **కందళికము.** } చూ. పై.
**కందాయము.** వి. జ్యేష్ఠాదిమాసచతుష్టయం.
**కంది.** వి.ఆఢకీ; తువరీ. 2.చూ.అక్కసము.
**కందు.** 1. వి. చూ. 2. అక్కసము. 2. కృష్ణః; శ్యామః; నీలః; అసితః; మేచకః; శ్యామః. 3. తిరశ్చాం... 4. పోతః; పాకః; అర్భకః; డింభః; శిశుః; శావకః. 5. శర్కరాభేదః. 6 అక. చూ. ఉరుటుపడు. 7. కృష్ణిభూ.
**కందుగల దుండగీఁడు.** చూ. ఎడగండు.
**కందుఁడు.** వి. 1.చూ.అంచయేనుఁగుమావంతు. 2. చూ. అగ్గిచూలి.
**కందురీఁగ.** వి. వరటా-టీ; వరటః; గంధోలీ; గంధాలీ; భ్రమరకీటః; వరలః; వరోలః; వరేణః; వారలా; భృంగః; భృంగరోలః; విషశూకః; విషభృంగీ; బ్రాహ్మణీ; తైలాటీ; తృణషట్పదః; వేశస్కృత్; ఇడాచికా.
**కందురు.** చూ. పై.
**కందువ.** వి.1.చూ. అంటులు.2.చమత్కారః; చమత్కృతిః (స్త్రీ). 3. చూ. 1పికతము. 4. చూ. ఆచూకి. 5. సంకేతః; సంకేతస్థానం-స్థలం; సమాగమస్థానం. 6.ఋతుః;

కాలః; సమయః. 7.చూ.2ఇక్క-8.బలం; శక్తిః (స్త్రీ); సామర్థ్యం;ఊర్జః(న్.న.); పరాక్రమః; విక్రమః; తేజః (స్. న.); ప్రభావః; సత్త్వం; క్షమతా; తరః(స్.న).

**కందువము.** చూ. 2. 8. పై.

**కందువాఱు.** అక. మలినః-నా-నం-కృష్ణః-అసితః-భూ.

**కందువు.** వి. చూ. అడ్డపట్టుపావ.

**కందెన.** వి. 1.శకటాక్షనిక్షిప్తా మషీ.2. శకటాక్షతైలం.

**కందెఱ.** వి. నేత్రచ్ఛదః;నయనచ్ఛదః; అక్షిపుటః; నయనవర్త్మ(న్.న.); ఆడంబరః.

**కంప.** వి. చూ. 1. ఈడిక.

**కంపకోట.** చూ. కంచెకోట.

**కంపగోడ.** చూ. కంచెగోడ.

**కంపపులుఁగు.** వి. కుక్కుభాఖ్య పక్షివిశేషః.

**కంపరము.** వి. ఖాటః-టా-టికా-టీ; శవవాహనం; కటః; ఖట్టిః (పుం); వారుఠః.

**కంపు.** వి 1. గంధః; వాసః. 2. దుర్గంధః; పూతిగంధః.

**కంపుదుమ్మ.** వి. విట్ఖదిరః (వృక్షః).

**కంపె.** వి. తాంబూల కరండకః; తాంబూల పాత్రం.

**కంపెలుక.** వి. చుచుందరీ; గంధ మూషీ; గంధాఖుః; గంధశుండినీ; గంధసూయీ; గంధసుఖీ; చిక్కః; పుంవృషః.

**కంబడి.** వి. కంబళః; రల్లకః; ఊర్ణాయుః (పుం); సహస్రరోమ(న్. న.); సాకూకః; కుతపః.

**కంబమయ్య.** వి. స్తంభోద్భూతః నృసింహః.

**కంబము.** వి. స్తంభః; స్థాణుః (పుం);స్థూణా; అవష్టంభః; దారుః (పుం.). 2. మల్లపరికర విశేషః.

**కంబమురాయఁడు.** చూ. కంబమయ్య.

**కంబళి.** చూ. కంబడి.

**కంబళిపురుగు.** వి. కూకకీటః.

**కంబవల్లి.** వి. స్తంభవల్లిః;

**కంబాలాట** వి. క్రీడావిశేషః.

**కంబు.** వి. సస్యవిశేషః.

**కంసాలవాఁడు.** చూ. అగసాలి.

**కంసాలి.** చూ. పై.

**కకపాల.** వి. కక్షపాలా; కక్షభస్త్రికా.

**కక (కా)వికలు.** వి. అస్తవ్యస్తతా.

**కక్కపాల.** చూ. కకపాల.

**కక్కరము.** విణ. కర్కరః; కర్కశః.

**కక్కసపడు.** అక.1. చూ. ఇంట్రుపడు.2.దుఃఖం అనుభూ; తప్(కర్మ.తప్యతే);వ్యథ్ 1గ. వ్యథతే-థితుం-త); క్లిశ్ (4గ. క్లిశ్యతే-క్లేశితుం-క్లిష్ట).

**కక్కసపెట్టు.** సక. 2. చూ. ఏఁచు. 2. సంబాధే-ధేన-స్థలాభావేన క్లిశ్. (9గ. క్లిశ్నాతి)-బాధ్(1గ.బాధతే-ధితుం-త).

**కక్కసము.** వి. 1.కశా; కషా; చర్మయష్టిః (స్త్రీ);ప్రతిష్కషః, భీమా;రజ్జుః(పుం.స్త్రీ); తాడనీ; ప్రతోదః; బలిసంగః. 2. చూ. 8.అంగద. 3.చూ.అనదు.4.విణ.కర్కశః-శా-శం;కఠినః; దృఢః; ఘనః; కఠోరః; సంహతః; కర్కరః; కర్కటః; కటోలః; నిష్ఠురః. 5. చూ.2. అగబాటు.

**కక్కసించు.** సక. చూ. కక్కసపెట్టు.

**కక్కిరివిక్కిరి.** చూ. అకటవికటము.

**కక్కు.** 1. వి. క్రకచ శిలాదిషూత్పాదితా కర్కశతా. 2. చూ. ఓకరించు.

**కక్కుఁదెవులు.** వి. రోగవిశేషః.

**కక్కుడు.** వి. చూ. 1. ఓకర.

**కక్కురితి (ర్తి).** వి.1. చూ. ఓపమి.

**కక్కుఱితి.** వి. చూ. పై. 2.లోభః;లుబ్ధతా; గృధ్రతా;గృధ్నుతా;లోలతా; అతిలిప్సా.

**కక్కుఱితికాఁడు.** చూ. వి. 1.చూ. అడియరి. 2. శ్రద్ధాహీనః; అశ్రద్ధధానః;

**కక్కువాయి.** వి. కాసరోగవిశేషః.

**కకూ్కరితి.** చూ. ఓపమి.
**కగ్గ(ము).** వి. చూ. అడిదము.
**కచిక.** వి. భస్మీకృతకరీషఖండః.
**కచిక్కు.** శరీరాద్యంతః ఖడ్గాదిప్రవేశధ్వన్యనుకరణం.
**కచోరము.** వి. కచ్చూరకః (శాకవిశేషః).
**కచ్చ.** వి. 1. చూ. 2. అచ్చొటు. 2. కచ్ఛవిశేషః. 3. కాపీసం. 3. కచ్చాటికా; కచ్చాటీ.
**కచ్చడము.** వి. 1. కాపీసం. 2. తూలజీరకాద్యానయనోపయుక్తా శకటికా.
**కచ్చి.** వి. 1. విదేశీయాశ్వవిశేషః. 2. తంతువాయసాధన విశేషగతం రంధ్రం.
**కచ్చిక.** చూ. కచిక.
**కచ్చితము.** విణ. అన్యూనాతిరిక్తః-క్తా-క్తం; సమః; యథాతథః.
**కచ్చియ.** వి. చూ. 3. ఆరివేరము.
**కచ్చు.** వి. 1. చూ. 1 అదటు. 2. చూ. 1. అక్కఅ. 3. దలం; పుష్పదలం; పుష్పపత్రికా-పత్రం. 4. శేఖరః అవతంసః; ఉత్తంసః; శిరోభూషా.
**కచ్చుకొను.** సక. ఆశంస్ (1గ. శంసతే-సితుం-త); ఆకాంక్ష్ (1గ. కాంక్షతి-క్షితుం-త); ప్రతీక్ష్ (1 గ. ఈక్షతే-క్షితుం-త);స్పృహ్ (10గ.స్పృహయతి-యితుం-హిత); వాంఛ్ (1గ. వాంఛతి-ఛితుం-త); ఆశాస్ (2గ.శాస్తే-శాసితుం-శిష్ట).
**కచ్చె.** వి. చూ. 3 ఆరివేరము
**కచ్చెపోతు.** విణ. కలహశీలః.
**కచ్చేరి.** వి. 1. కాలీచీ; చూ. 5. అంగడి. 2. గోష్ఠీ; వినోదగోష్ఠీ; నర్మసంలాపః.
**కజాయము.** వి. ఖాద్యవిశేషః, అపూపః.
**కజూరము.** వి. చూ. 2. ఉబ్బలి.
**కట.** అవ్య. హంత; బత (అవ్య).
**కటకట.** 1. చూ. పై. 2. దంశనధ్వన్యనుకరణం.
**కటకటంబడు** అక. 1. చూ. అచ్చలించు. 2. చూ. కక్కసపడు.
**కటకటాలు.** వి. అయశ్శలాకావృతిః(స్త్రీ).
**కటకరము.** వి. గంధర్వః (మృగవిశేషః).
**కటకసరులు.** వి. శాలివిశేషః.
**కటపెట.** వి. ఘర్షణధ్వన్యనుకృతిః.
**కటా.** చూ. కట.
**కటారి(రు).** వి.1.ఛురికా, ఛురీ, కర్తరికా; క్షురీ; కృంతనికా; కృంతత్రం; శస్త్రీ; కృపాణీ-ణికా; అసిపుత్రికా, అసిధేనుకా. 2. చూ. అడిదము.
**కటిక.** వి1. రాజవేత్రహస్తః.2. ఖట్టికః; మాంసికః; మాంసవిక్రేతా (బు). 3. చూ. అంగజాల. 4. మల్లపరికరబంధవిశేషః.
**కటికచీకటి.** వి.అంధతమసం; గాఢతమః(స్. న); నిబిడాంధకారః.
**కటికమృగము.** వి. ఖడ్గమృగః, ఖడ్గః, ఖడ్గీ(న్); ఏకశృంగః; గండః; గండకః; గండాంగః; ఏకచరః; వనోత్సాహః; తైతిలః.
**కటికవాడు.** చూ. 1. 2. కటిక.
**కటికి.** విణ. 1. చూ. 4. అంకపొంకములు. 2. చూ. 4. కక్కసము. 3. చూ. 4. అచ్చు. 4. చూ. 1. ఇట్టలము. 5. కఠినః; పరుషః; కృపాహీనః; నృశంసః; నిర్దయః; క్రూరః.
**కటివాడు.** చూ. 1 కటిక.
**కటుక్కు.** దంశనధ్వన్యనుకరణం.
**కటుగు.** చూ. కంపరము.
**కటుమరలు.** వి. కపోలోపరిభాగః.
**కటువు.** చూ. కంపరము.
**కట్టు.** వి.1. చూ. 1. ఎక్కము. 2.చూ. కట. 3. తటాకాది తీరం.

**కట్టుకడ.** వి. ప్రత్యంతః; ప్రాంతః; పర్యంతః.
**కట్టుడి.** వి. 1 విధిః(పుం); విధానం; నియమః; వ్యవస్థా; స్థితిః(స్త్రీ); ధర్మః; మర్యాదా; క్రమః. 2. చూ. 1 అంగము. 3. చూ. అప్పణ. 4 చూ. ఉగ్గడ.
**కట్టడచేయు.** సక. చూ. 6 అంచు.
**కట్టడము.** వి. చూ. ఒలె.
**కట్టుడి.** వి. 1. చూ. కట్టడ; 2 చూ. 5. కటికి.
**కట్టనము.** వి. 1. చూ. ఒలె. 2. చూ. 2. అప్పనము. 3. బంధనం; బంధః; సంశ్లేషః; సంహతిః(స్త్రీ).
**కట్టుపుట్టుచెండ్లు.** వి. క్రీడావిశేషః.
**కట్టరము.** వి. నాట్యబంధ విశేషః.
**కట్టాణి.** వి. చూ. అణి.
**కట్టాణిగుండ్లు.** చూ. అడ్డిగలు.
**కట్టాయితము.** చూ. 3. అలవాటు.
**కట్టారము.** వి. నాట్యబంధవిశేషః.
**కట్టాలి.** విణ. అవ్యక్తః-క్తా-క్తం.
**కట్టి.** 1. చూ. 1. కటిక. 2. చూ. కంబము.
**కట్టిఁడి.** వి. చూ. 5 కటికి.
**కట్టుతాడి.** వి. దేవతాలః.
**కట్టినది.** వి. గర్భవతీగవాదిః.
**కట్టియ.** వి. కాష్ఠం; దారుః (పుం)-రు(న). 2. చూ. అంప. 3. దండః.
**కట్టు.** వి. 1. చూ. 2. ఇక్క. 2. చూ. 2. అంకణము. 3. బుసం - షం; తుచ్ఛం; తుచ్ఛధాన్యకం. ధాన్యకల్కం, 4. యూషః-షం. 5. చూ. 3 కట్టనము. 6. వస్త్రధారణం; పరిధానం. 7. నిబంధనం; నియమః; సహంతిః(స్త్రీ); కార్యాచరణాదౌ ఐకమత్యం. 8. కారానిరోధః; నిరోధః-ధనం; బంధనం; ఆసేధః; రోధః; ప్రగ్రహః. 9. పరిమాణం; పరిమితిః (స్త్రీ); అవధిః (పుం) సీమా(న్. పుం. ; పరిచ్ఛేదః. 10. అక. గర్భిణీ భూ (గవాదిః). 11. బంధ్ (కర్మ. బధ్యతే); నిబద్ధః-నిరుద్ధః-భూ 12. బంధ్ (9గ. బధ్నాతి - బంధుం - బద్ధ) గ్రంథ్ (9గ. గ్రథ్నాతి - గ్రథితుం - త - (1గ. గ్రంథతి). పినహ్ (4. నహ్యతి-నద్ధుం-ద్ధ). 13. ఆరుహ్ (ప్రే. రోపయతి), అభిసంబంధ్ (9 గ. బధ్నాతి-బంధుం-బద్ధ); ఆరోపణంకృ. 14 అర్జ్ (10గ. అర్జయతి-యితుం-ర్జిత); సంచి (5గ. చినోతి-చేతుం-చిత). 15. నిర్మా (2 గ. మాతి-3గ. మిమీతే-4గ. మీయతే-మాతుం-మిత); కృ(8గ. కరోతి-కర్తుం-కృత); క్లృప్. (10గ. కల్పయతి-యితుం-ల్పిత;) విరచ్. (10గ. రచయతి -యితుం-చిత). 16. పరిధా (3గ. దధాతి-ధత్తే-ధాతుం-హిత); వస్ (2గ. వస్తే-వసితుం-త); ఆచ్ఛద్ (10గ. చ్ఛాదయతి-యితుం-దిత); ఆముచ్ (6గ. ముంచతి-మోక్తుం-ముక్త).
**కట్టుక (గ).** వి. పశుగర్భస్రావః.
**కట్టుగడ.** వి. సంచితధాన్యం.
**కట్టుఁగంబము.** వి. ఆలానం; బంధనస్తంభః.
**కట్టుఁగొంగు.** వి. పరిధీయమానం వస్త్రాంచలం.
**కట్టుఁగొమ్మ.** చూ. అడ్డకట్టు.
**కట్టుగొయ్య.** వి. ఈషా; లాంగలదండః.
**కట్టుగొట్టు.** వి. మేథిః (పుం.); ఖలస్థాణా (పశుబంధనార్థం).
**కట్టుఁగోక.** వి. అంతరీయం; కటిబద్ధంవసనం.
**కట్టుచారు.** వి. యూషః-షం.
**కట్టుదొన.** వి. పుష్కరిణీ; సర్వతోజలావతారాంచితం సరః (స. న.).
**కట్టుపకాసి.** విణ. రణోద్యుక్తః; శూరః.
**కట్టుపకాసు.** విణ. అచలః; స్థిరః; అచంచలః.
**కట్టుపడు.** అక. బంధ్ (కర్మ. బధ్యతే); బద్ధః-ద్ధా-ద్ధం-భూ.
**కట్టుపాటు.** వి. 1. బద్ధత్వం-తా. 2. చూ. 7. కట్టు.
**కట్టుబండి.** వి. సకలపరికరాఢ్యంశకటం.
**కట్టుబట్ట.** చూ. కట్టుఁగోక.

**కట్టుబడి.** వి. భటాయ దత్తా (పారితోషిక తయా) భూమిః.
**కట్టుమట్టు.** వి. పశుబంధనస్థానం. 2. నివాసః-సస్థానం. 3చూ. ఏరుపాటు.
**కట్టుమామిడి.** వి. వస్త్రాద్యాచ్ఛన్నఫలః చూతః.
**కట్టుమ్రాను.** వి. ప్లవః; ఉడుపః-పం, తరణః-ణీ; తరణిః(పుం). ప్లవాకా, తరండః; తరత్ (త్. స్త్రీ.): తర్ణిః(పుం); తారణః; వహిత్రం; వారిరథః; కోలః; భేలః; లకః, హోడః.
**కట్టువ.** వి. చూ. 2. కంచియ.
**కట్టె.** చూ. కట్టియ.
**కట్టెగుజ్జము.** వి. బాలక్రీడా విశేషః,
**కట్టెడ.** వి. తిర్యగ్రేఖాన్వితః సర్పవిశేషః.
**కట్టెర.** వి. కపాలః-లం, కర్పరః; శిరోస్థి; శీర్షకం; కరోటం-టిః-టీ (స్త్రీ); ముండః-డం; భగాలః.
**కట్టెవిరువుమాట.** వి. పరుషవచనం; కర్కశ వాక్యం; పరుషోక్తిః (స్త్రీ); శుక్తం; విక్రుష్ట వచనం.
**కట్నము.** వి. చూ. 2. అప్పనము.
**కట్ల.** వి. 1. ఖట్వాయానం 2. ఖట్వాఖ్యా లతా.
**కట్ల గుదియ.** వి. ఆయుధవిశేషః
**కట్ల జెట్టి.** వి. విషకీటవిశేషః; శతపదీవిశేషః.
**కట్లదండ.** చూ. ఉత్తరిగ.
**కట్ల పురుగు.** వి. సర్పవిశేషః.
**కట్లబల్ల.** వి. ఆకుంచనార్హపాదందారుఫలకం.
**కట్లమంచము.** వి. చూ. 1 కట్ల.
**కట్లమారి.** వి. బంధనవాన్-వతీ-వత్; గ్రంథిమత్.
**కట్ల సంచి.** వి. అనేకాంతర్విభాగ భస్త్రికా విశేషః.
**కట్లి (ట్లీ).** చూ. 1. కట్ల.
**కట్లియ.** వి. సువర్ణోన్మానోపయుక్తః గోలః.
**కట్లె.** . చూ. పై.
**కఠారి.** వి. చూ. 1. అడిదము.
**కఠిల్లు.** వి. తాడనధ్వన్యనుకరణం.
**కడ.** వి. 1. చూ. 1. ఆస. 2. చూ. 2. ఠక్కు. 3. చూ. 4 ఎడ. 4. చూ. 2 అంచ. 5. చూ. 1. అంక. 6. అంతః-తం; పారః-రం; సమాప్తిః(స్త్రీ). 7. విశ. అంత్యః-త్యా-త్యం; అంతిమః. 8. చూ. ఈల్గుట.
**కడంక.** వి. 1. చూ. ఒడికారము. 2. చూ. 3. ఉక్కు. 3. చూ. అయతము. 4. సాహసం; ప్రాగల్భ్యం; ప్రగల్భతా.
**కడక.** వి. శిరః పార్శ్వం; శ్రవణనయన మధ్యదేశః;
**కడఁక.** వి. చూ. అయతము.
**కడకన్ను.** వి. చూ. కంటితుద.
**కడకాళ్లు.** వి. పాదాగ్రం; అగ్రపాదః.
**కడకు.** వి. కదంబ వృక్షః.
**కడకుఁబోవు.** అక. చూ. అంటగు.
**కడకొఱవి.** వి. ఉల్కా; ఉల్ముకం, అంగారః-రం; అలాతం; ఆలాతం; అగ్నికాష్ఠం; అగ్నికుక్కుటః; కుక్కుటః; కులుక్క గుంజా; అగ్నియుద్ధకాష్ఠం; జ్వలనకాష్ఠం.
**కడగండ్లమారి.** చూ. అగచాట్లపోతు
**కడగండ్లు.** చూ. 2 అగచాటు
**కడగట్టు.** సక. నిశ్చి (4గ. చినోతి-చేతుం చిత); నిర్ణీ (1గ. నయతి-నేతుం-నీత). వ్యవసో(4.గ. స్యతి-సాతుం-సిత); వ్యవస్థా (ప్రే. స్థాపయతి); సిద్ధీకృ; సిద్ధాంతీకృ.
**కడగన్ను.** చూ. కంటితుద.
**కడఁగు.** అక. చూ. 1. అంగవించు.
**కడగొట్టు.** అక. చూ. ఇలుగు. 2. విశ. అంత్యః త్యా-త్యం; అంతిమః,; చరమః.
**కడచను.** అక. చూ. ఇలుగు. 2. చూ. 4. అడగు. 3. చూ. 1. అయిపోవు. 4. చూ. 5. ఈదు.

**కడచు.** 1. అక. చూ. ఇలుగు. 2. గతః-యాతః-సమాప్తః-భూ. 3. చూ. 4. ఉద్వేలః-లా-లం-భూ. 5. చూ.3. ఎచ్చు. 6.చూ.5. ఈఁదు. 7. చూ.2.అంగవించు.

**కడచుక్క.** వి. రేవతీ (నక్షత్రం).

**కడజాతివాఁడు.** వి. చండాలః.

**కడంజు.** వి. గోకర్ణమృగః.

**కడజు.** చూ. పై.

**కడఁత.** చూ. కడక.

**కడంతి.** వి. గంధర్వాఖ్యమృగవిశేషః.

**కడఁతి.** 1. చూ. పై. 2. చూ. అణియ.

**కడతెగు.** అక. చూ. 1.అయిపోవు.

**కడతేఱు.** అక.1.2.3. చూ. 1.2.3.కడచను. 4. చూ. 2. కడచు;

**కడదెసఁగాపరి.** వి. ఈశానః.

**కడప.** వి. 1· దేహలిః-లీ; గృహావగ్రహణీ; ద్వారపిండీ; రుండికా; అంబురః; ఉదుంబరః. 2. కదంబవృక్షః.

**కడపటు.** చూ. 4. అంచు.

**కడపటిమల.** వి. చక్రవాలాద్రిః (పుం).

**కడపల.** చూ. 6. కడ.

**కడపు.** 1. ప్రే.అదత్వా గమ్(ప్రే.గమయతి)-యా (ప్రే. యాపయతి). 2. సక. హన్. (2గ. హంతి-హంతుం-హత); వ్యాపద్ (ప్రే. పాదయతి), మృ(ప్రే.మారయతి); సూద్ (10గ. సూదయతి-యితుం దిత); నశ్ (ప్రే. నాశయతి); ప్రమీ(ప్రే.ప్రమాపయతి); శద్(10గ. శాతయతి-యితుం-తిత; శస్(1గ. శసతి-సితుం_స్త);హింస్ (7గ. హినస్తి- 1గ. హింసతి-సితుం త). 3. చల్. (ప్రే. చాలయతి); వహ్ (ప్రే వాహయతి);నుద్ (6గ. నుదతి-నోత్తుం-నున్న).4.త్యజ్.(1.గ. త్యజతి-త్యక్తుం-క్త);ఉత్సృజ్(6గ.సృజతి.స్రష్టుం-సృష్ట); ఉజ్ఝ్ (6గ.ఉజ్ఝతి-జ్ఝి)తుం -త);హా (2గ.జహాతి - హాతుం-హీన); ముచ్ (6గ. ముంచతి- మోక్తుం- ముక్త).

**కడపుఁజేయి.** వి. క్షేపణిః-ణీ; క్షిపణిః-ణీ;; క్షపణీ; నౌకాదండః; అరిత్రం; ఆరిత్రం; తరండః, తరిరథః.

**కడఁబడు.** చూ. 2. అడఁగు.

**కడమ.** వి. 1.చూ. అచ్చిక. 2.చూ.అన్నెము. 3. శిష్టః-ష్టా-ష్టం; శేషః; ఉద్వృత్తః; ఉద్వర్తః.

**కడమపడు.** అక. అల్పీభూ; న్యూనీభూ; హ్రాస్(1గ.హ్రాసతే-సితుం_త); హ్రాస్వీభూ.

**కడముంత.** వి. అత్యల్పమృద్భాండః.

**కడముట్టు.** అక. చూ. 1.అయిపోవు. 2.చూ. 4. అమరు.

**కడరాసి.** వి. మీనరాశిః (పుం).

**కడలి.** చూ. ఏటిఱేఁడు.

**కడలికానుపు.** చూ. ఈగిమ్రాను.

**కడలికూతురు.** వి. లక్ష్మిః; పద్మాలయా· పద్మా; కమలా; శ్రీః; హరిప్రియా; ఇందిరా; లోకమాతా; మా; రమా; మంగళదేవతా; క్షీరోద తనయా; భార్గవీ; లోకజననీ.

**కడలిబత్తలికదునేదారి.** చూ. అంగమొల వేల్పు.

**కడలిమీఁగడముద్ద.** చూ. ఎదగందు.

**కడలియల్లుఁడు.** చూ.అడుగువమ్మటులాఁడు.

**కడలిరాతత్తడి.** వి. మకరః; నక్రః; కుంభీరః; ఆలస్యః; మహాముఖః; ద్విధాగతిః; అసిదంతః; జలశూకరః; జలహస్తి (న్).

**కడలిఱేఁడు.** చూ.ఏటిబోటిమగలయెకిమీఁడు

**కడలిలోనీరుద్రావెడి వేఁడి.** వి. ఔర్వః; బాడబాగ్నిః; సముద్రవహ్నిః.

**కడలివెన్న.** చూ. ఎదగందు.

**కడలి వెలది.** చూ. అంచలవిడిది.

**కడలు.** చూ. అక్కలి.

**కడలుకొను.** అక. 1.చూ. 7. అడరు. 2 చూ. 3. ఉప్పొంగు. 3. చూ. 4. అడరు.

**కడల్కొను.** అక. చూ. 4. అడరు.

**కడలొత్తు.** చూ. పై.

**కడవ.** వి. ఘటః; భాండం, పాత్రం, భాజనం; కుండీ, కుంభః-భీ; కలశః, కలసీ, ఉదకుంభః, నిపః; అలుః (పుం).

**కడవతీటు.** వి. వాద్యవిశేషః;

**కడవంబడు.** అక. చూ. 2. కడచు.

**కడవసము.** వి. చర్మ; (న్.న.). ద్రుతిః (పుం); పశుత్వక్ (చ్. స్త్రీ); కృత్తిః (స్త్రీ); అజినం, వర్ధ్రం; శిపిః (స్త్రీ).

**కడవాఁడు.** 1. చూ. 1 ఉన్నవాఁడు. 2. అనుజః, కనీయాన్; (స్), అనుజన్మా (న్); అవరజః.

**కడవెళ్లు.** అక. చూ. 1 అయిపోవు. 2. సక. చూ. 5. ఈఁదు.

**కడసరము.** వి. చూ. అడుజు.

**కడసారి.** వి. అంత్యపర్యాయః,

**కడాని.** చూ. అపరంజి.

**కిడాసము.** చూ. కడసము.

**కడింది.** విశ 1. అతికఠినః, - నా - నం. 2. వి. చూ. 1. కాంతి.

**కడి.** వి. 1. గంధః 2. గ్రాసః, పిండః; కబలః; కవకః. 3. చూ. 2. అనద. 4. వ్రణః- ణా-ణం; క్షతం; క్షతిః; (స్త్రీ); అరుః (స్. న.); ఈర్మం, వేధః-ధనం, ప్రహారః అఘాతః, లూనకః. 5. కరీషపిండః.

**కడికండలు.** వి. ఖండఖండాః.

**కడిగొను.** సక. చూ. ఎరగొను.

**కడితము.** వి. గణితపుస్తకం.

**కడితి.** వి. గోకర్ణమృగః.

**కడిదలుఁగు.** చూ. కంటివాలు.

**కడిఁది.** వి. 1. చూ. 2. అగజాటు. 2. చూ. 4. అగ్గలిక. 3. చూ. 6 ఒడ్డు. 4 చూ. 2. అంకిలి. 5. చూ. 4. అంకపొంకములు. 6. చూ. 3. అక్కజము. 7 చూ. 3. అరిది. 8 చూ. 4. కక్కసము.

**కడిమి.** వి. చూ. 1. అగ్గలము. 2. చూ. 5 అగ్గలిక. 3. కదంబ వృక్షః. 4 చూ. 4. అగ్గలిక.

**కడిమిడి.** వి. హరితతృణాఢ్యా భూమిః.

**కడియపుటట్టు.** వి. భక్ష్యవిశేషః.

**కడియము.** వి. కటకం. హస్తభూషావిశేషః.

**కడివోవు.** అక. చూ. 4. అడఁగు.

**కడిసెల.** వి. మత్స్య విశేషః.

**కడున్.** అవ్య. చూ. 1. అనయమున్.

**కడుకొను.** అక. చూ. 7. అడరు. 2. చూ. 1. అంగవించు.

**కడుగు.** వి. 1. తండులోదకం, తండులక్షాలనోదకం. 2. క్షాలనం; ధావనం; మార్జనం; నిర్ణేకః, నిర్ణేజనం, అవనేజనం. 3. సక. జలేన - ప్రక్షల్. (10 గ. క్షాలయతి - యితుం-లిత); నిర్ణిజ్ (3 గ. నేనేక్తి-నేక్తుం-నిక్త); శుధ్. (ప్రే. శోధయతి-తే); ధావ్ (1గ. ధావతి-తే-వితుం-ధౌత-ధావిత).

**కడుజు.** వి. శ్యేనవిశేషః.

**కడుదు.** చూ. 4. అగ్గలిక.

**కడుఁదురు.** చూ. కందురీఁగ.

**కడుపు.** వి. 1 గర్భః; గర్భస్థపిడం. 2. ఉదరం; కోష్ఠః-ష్ఠం; పక్వాశయః; జఠరః; పిచండః; పిచిండః; కుక్షిః (పుం); తుందం; తుంది (న్).

**కడుపుబ్బు.** వి. చూ. 1ఉబ్బరము.

**కడుపుమంట.** వి. చూ. 1. ఉరస.

**కడుపూఁద.** వి 1. చూ. పై. 2. పశూనాం అతీసారసహిత రోగవిశేషః.

**కడుపేడు.** వి. సూక్ష్మం వంశచర్మ యేన శూర్పాదిషు బంధనం, క్రియతే.

**కడుముంత.** చూ. కడముంత.

**కడువ.** చూ. కడవ.

**కడువతాటు.** వి. వాద్యవిశేషః.

**కడువరాసి.** వి. కుంభ రాశిః.

**కడువు.** అక. చూ. 3. కడుగు.

**కడెము.** వి. కటకం; హస్తాభరణం.

**కడ్గు.** 1 2. చూ. 1. 3. కడుగు.

**కడ్డాయము.** వి. బలాత్కారః; సాహసం; ప్రమాథః; ప్రసభం.

**కడ్డి(డ్డీ).** వి. 1. కఠినీ; ఖటినీ, ఖటికా, ఖడికా; వర్ణలేఖా. కఠికా. 2. శలాకా. (సువర్ణాదీనాం). 3. శలాకా.

**కడిమ్మి.** చూ. కడిమి.

**కణఁక.** వి. చూ. ఆయతము.

**కణఁకు.** వి. చూ. 1. అంటనిజెజే.

**కణఁగు.** అక. చూ. 3. కడుగు.

**కణఁజము.** వి. కుసూలః, ధాన్యాగారం; శస్యాగారం; వ్రీహ్యాగారం; అన్నకోష్ఠః -ష్ఠకః; కోష్ఠకం; కండోలః-లకః; కాండాలః; పిటః; కృదరః; మరారః; భూమ్యధః గుప్తం ధాన్యం, ధాన్యస్య భూమ్యధోనిక్షేపః;

**కణఁజు.** చూ. కడంజు.

**కణఁత.** వి. చూ కడక.

**కణఁతి.** వి.చూ. కటకరము.2.చూ. అణియ.

**కణసెరము** చూ. అడుజు.

**కణాతిగోడ.** వి. పటకుడ్యం.

**కణిఁతి.** చూ. ఆజియ.

**కణితి.** చూ. కడంజు.

**కణుజు.** 1. చూ. అడుజు. 2. చూ కడంజు.

**కణుఁదురు(రీఁగ).** చూ. కందురీఁగ.

**కణుపు.** వి. వేణుపర్వ (న్.న;) వేణుగ్రంథిః (పుం); గ్రంథిః.

**కత.** 1. కథా; గాథా; కథానకం; ఆఖ్యానం: ఆఖ్యాయికా. 2. చూ.1. ఉబుసు.

**కతనన్.** అవ్య. కారణతః; కారణేన; హేతోః.

**కతము.** వి. 1. చూ. అంకనము. 2.చూ. 5. అక్కఱ.

**కతుక్కు.** దంశధ్వన్యనుకృతిః.

**కత్తరి.** 1.వి. క్షుద్రజలచరవిశేషః. 2.విశే. నానావర్ణః;-ర్ణా-ర్ణం; శబలః; చిత్రః; కర్బురః; నానారంగః; శారః-రీ-రం; కిర్మీరః; కల్మాషః-షీ-షం; పతః-తా-తీ తం. 3.మిశ్రవర్ణః; వర్ణసంకరవాన్-వతీ-వత్.

**కత్తరిగలయు.** అక. మిల్ (6గ. మిలతి-మేలితుం-మిలితః); సంకౄ (కర్మ. సంకీర్యతే); సంయుజ్ (కర్మ. యుజ్యతే); మిశ్రీభూ; సంకరీభూ.

**కత్తరిల్లు.** అక. చూ. 1 అటమటించు.

**కత్తలాన.** వి. కర్తలానః. శ్లో. పూర్వపత్సర్వ్వ శుక్లాంగః త్వచాకృష్ణో భవేద్యది. వర్ణో నామ్నా సవిజ్ఞేయః కర్తలానస్తురంగమః. (శివతత్త్వ రత్నాకరము).

**కత్తలాని(శఁడు).** చూ. పై.

**కత్తళము.** వి. వర్మ (న్. న.); లోహవర్మ; తనుత్రం; తనుత్రాణం; కవచః;-చం; వారవాణః; కంచుకః; త్వక్త్రం; దంశనం; సన్నాహః; దేహావరణం: యుద్ధాస్త్రం; తనువారం; సజ్జా.

**కత్తళీఁడు.** వి. వర్మధరః.

**కత్తవ.** చూ. 1. ఎక్కుము.

**కత్తి.** వి. 1. మల్లబంధవిశేషః. 2. శస్త్రం; ఆయుధం; ప్రహరణం; అస్త్రం; హేతిః (స్త్రీ); పరిఘాతః; బధత్రం శస్త్రాస్త్రం. 3.చూ.అడిదము. 4.క్షురికా(నాపితస్య).

**కత్తికాసు.** వి. రథకారస్య సాధనవిశేషః.

**కత్తిపిడక.** వి. అసిపిటకః (శాకరసగ్రాహిణః).

**కత్తిపీఁట.** వి. ఈలిః-లీ; పీఠాసిః(పుం).

**కత్తిమందు** వి.1.ఖడ్గకోషలేపనం. 2.క్షతలేపనౌషధిః-ధీ (స్త్రీ).

**కత్తియ.** వి. 1. చూ. అడిదము.

**కత్తియము.** వి. అంకానాం తిర్యక్పంక్తిః. (స్త్రీ)

**కత్తిరించు.** క్రి. కృత్ (6. గ. కృంతతి-కర్తితుం-కృత్త). ఛిద్. 7గ. ఛినత్తి-ఛేత్తుం-ఛిన్న); లూ(9గ. లునాతి-లవితుం-లూన); వ్రశ్చ 6గ. వృశ్చతి-వ్రశ్చితుం-వృక్ణ); ఛో (4గ.-ఛ్యతి.-ఛాతుం-ఛాత-ఛిత); దో(4గ.-ద్యతి-దాతుం-దిత); దా (2గ. దాతి).

**కత్తిరిల్లు.** అక. చూ. 1. ఎడఁబాయు.

**కత్తివాతియమ్ము.** వి. అర్ధచంద్రశరః, భల్లః.

**కత్తువ.** వి.మృదుక్షేపణీ.2.చూ.1.ఎక్కము.

**కత్తె.** చూ. కత్తియ.

**కత్తెము.** చూ. కత్తియము.

**కత్తెర.** వి.1.కృత్తికాః(నక్షత్రం);2.కర్తరీ కర్తనీ. కృపాణీ; కర్త్రీ ఛేదనీ; ఖండధారా; శరారీముఖీ. 3. కర్తరి (భరణీ తృతీయ చతుర్థ పాదయోః, కృత్తికాయాం రోహిణీ ప్రథమపాదేచ సూర్యావస్థితికాలః). 4.మల్లబంధవిశేషః.5.చూ. అనుమంతిగాఁడు.

**కత్తెరగాయము.** వి. గవాక్ష విశేషః.

**కత్తెరచీల.** వి. కీలాంతరంధ్రస్థాపితఃసూక్ష్మకీలః.

**కత్తెరదొంగ.** వి. చూ. ఎతుకరికాఁడు.

**కత్తెరనెల.** వి. కార్తిక మాసః.

**కత్తెరబావిలి.** వి. స్త్రీ. కర్ణభూషావిశేషః.

**కత్తెరవంగ.** వి. వార్తాక విశేషః.

**కత్తెరవానము.** వి. కర్తర్యాకృత్యాస్థాపితా గృహాయష్టిః (స్త్రీ).

**కత్రి.** వి. జక్కిణ్యాఖ్య క్రీడావిశేషాంగం.

**కత్రించు.** చూ. కత్తిరించు.

**కద.** 1. చూ.కళ. 2.(అవ్యయంకిలార్థకం.) కిల; ఖలు; నను.

**కదంబకము.** వి. మిశ్రతా; మిశ్రీభావః; సంస్పృష్టతా; సంసర్గః; సంయోగః; సంకీర్ణతాః; సాంకర్యం.

**కదంబము.** వి.1.చూ. పై. 2.యక్షకర్దమః (కర్పూరాగురుకస్తూరీ కక్కోలైర్యక్షకర్దమః").

**కదంబించు.** అక. 1. చూ.కత్తరిగలయు. 2. క్రి. మిశ్ర్ (10. గ. మిశ్రయతి-యితుం-శ్రిత). సంయుజ్ (7గ.యునక్తి యోక్తుం-యుక్త); సంపృచ్ (7గ పృణక్తి-పర్చితుం - పృక్త); సంకౄ (6 గ-కిరతి-కరితుం-కరీతుం-కీర్ణ).

**కదము.** వి. అశ్వగతివిశేషః.

**కదరము.** చూ. 2. ఉత్తరేను.

**కదరె(రే).** అవ్య. చూ. 7 అంగద.

**కదలడమ్ము.** చూ. అరుగుడు.

**కదలాడు.** అక. చూ. 1. అటుమటించు.

**కదలిక.** వి.1. చూ.2.అదరు. 2.ఆయతము.

**కదలిపోక.** చూ. అరుగుడు.

**కదులు.** వి. 1. చూ. 2. అదరు. 2. చూ. ఆయతము. 3. అక.చూ. 1.అటమటించు. 4. చూ. అరుగు. 5. చూ. 2. ఉలుకు. 6. చూ. 1. అంగవించు.

**కదులుచు(ల్చు).** క్రి. చల్ (క్రి. చాలయతి).

**కదులుడు.** చూ. అరుగుడు.

**కదులుతులుము.** చూ. ఇంగళింపు.

**కదా.** అవ్య. చూ. 3 కద.

**కదించు.** క్రి. సంగమ్ (క్రి. గమయతి); సంయుజ్ (క్రి. యోజయతి).

**కదియఁబడు.** అక. చూ. అంటసిల్లు.

**కదియించు.** క్రి. చూ. కదించు.

**కదియు.** అక. 1. చూ. అంటసిల్లు. 2.తుల్యః-ల్యా-ల్యం-సమానః - సదృశః - భూ. 3. చూ. 11 అంటు.

**కదుకొను.** చూ. 7. అడరు.

**కదుపు.** వి.1.గోకులం; గోవృందం; ధైనుకం 2.యూథం; గణః; సంఘః; సమూహః;

వృదం; వ్రజః; కదంబకం; నివహః; నికరః; సమవాయః; సార్థః; సమజః; సందోహః.

**కదుము.** వి. 1. ఆఘాతజనితః గ్రంథిః; కిణః-ణం. 2. సక. చూ. 4. అప్పళించు.

**కదురు.** వి. 1. తంత్వాధారసూచికా. 2. అక. చూ. 7. అడరు. 3. చూ. 8. అడరు. 4. చూ. 6. అడరు.

**కదె (దే).** అవ్య. చూ. 3. కర.

**కద్దుము.** విణ. చూ. 4. అచ్చ.

**కనన్.** అవ్య. ప్రాయః వాక్యాలంకారత యోపయుజ్యతే 'తావత్' ఇత్యాదివత్.

**కనకన్.** అవ్య. అతః; తతః; తస్మాద్ధేతోః.

**కనక తప్పెట.** వి. పటహః.

**కనకన.** వి. అంగారగతాగ్నేః మహాన్ ప్రకాశః.

**కనకనమను. కనకనలాడు.** అక. అతీవ ప్రకాశ్ (1 గ. కాశతే-శితుం-త); దీప్ (4. గ. దీప్యతే-దీపితుం-దీప్త).

**కనరు.** వి. 1. చూ. ఒగరు. 2. తిక్తః. 3. వికటగంధః. 4. చూ. 2. అంకపాంకములు. 5. సూరణకందాదిగతా కటుతా. 6. విణ. అహితః-తా-తం; అపథ్యః.

**కనలు.** వి. 1. చూ. 2. అంకపాంకములు. 2. చూ. ఏర్పు. 3. అక. చూ. అచ్చరించు. 4. చూ. 1. ఎరియు.

**కనాతిగోడ.** వి. పటకుడ్యం.

**కనారిలు.** చూ. అచ్చలించు.

**కనికరము.** వి. 1. చూ. అక్కటిక. 2. చూ. 3. అడలు.

**కనికరించు.** అక. 1. చూ. 6. అడలు. 2. అనుకంప్ (1 గ. ); దయ్. (1 గ. దయతే - యితుం-త); దయాం-అనుకంపాం-కరుణాం-కృపాం-కృ.

**కనిపట్టు.** సక. అన్విష్య గ్రహ్ (9గ. గృహ్ణాతి-గ్రహీతుం-గృహీత).

**కనిపించు.** 1. ప్రే. దృశ్ (ప్రే. దర్శయతి). 2. అక. దృశ్ (కర్మ. దృశ్యతే); ప్రభూ (1గ. భవతి-వితుం-భూత); ప్రకాశ్ (1 గ. కాశతే-శితుం-త); ఉద్ (1 గ. ఉద యతి-తే-ఏతుం-ఇత); ప్రత్యక్షీ భూ.

**కనియ.** వి. చూ. 1 అరవరలు.

**కనియు.** అక. సమ్యక్ పక్వః-క్వా-క్వం-భూ; పక్వతయా అతిమృదులీ భూ.

**కనిసెరము.** వి. శ్యేనవిశేషః.

**కనీసము.** విణ. చూ. 4. అడుగు.

**కను.** వి. 1. చక్షుః (స్. న); నయనం; లోచనం; నేత్రం; అక్షి (న); ఈక్షణం; దృష్టిః; (స్త్రీ); దృక్ (శ్. స్త్రీ); దృశా; దృశిః (స్త్రీ); అక్షం; దైవదీపః; విశ్వంకరః; 2. ఇక్షుదండాదీనాం పర్వాధో భాగస్థః అవటః. 3. సక. దృశ్ (1 గ. పశ్యతి-ద్రష్టుం-దృష్ట); ఈక్ష్ (1 గ. ఈక్షతే-క్షితుం-త); ఆలోక్ (10 గ. లోకయతి-యితుం-కిత; 1 గ. లోకతే-కితుం); లక్ష్ (10 గ. లక్షయతి-యితుం-క్షిత); ఆలోచ్ (10 గ. లోచయతి-యితుం-చిత); నిర్వర్ణ్ (10గ. వర్ణయతి-యితుం-ర్ణిత); జన్ (ప్రే. జనయతి). 5. చూ. ఎఱుఁగు. 6. చూ. 11. అంటు. 7. భాగ్యం లభ్ (1 గ. లభతే-లబ్ధుం లబ్ధ).

**కనుఁగొను.** సక. 1. చూ 3. కను. 2. చూ. ఎఱుఁగు.

**కనుకన్.** అవ్య. 1. చూ. కనకన్. 2. చూ. కనన్.

**కనుకట్టు.** వి. ఇంద్రజాల విద్యావిశేషః.

**కనుకని.** వి. చూ. 7. అక్కఱ.

**కనుకలి.** వి. దృష్టిః (స్త్రీ); దర్శనం; వీక్షణం; ఆలోకనం; నిశామనం; నిర్వర్ణనం; నిధ్యానం; నిభాలనం; నిభాలనం.

**కనుకుట్టు.** విణ. బాధకః - ధికా - ధకం; బాధాకరః; పీడాకరః.

**కనుకుట్టుఁదనము.** వి. చూ. 1. ఈరస.
**కనుకూలి.** వి. ధాన్యరూపం వేతనం.
**కనుగిలుపు** వి. ఈషన్నేత్రచాలనం (సూచనార్థం); నేత్రసంకేతః; అక్షిసంజ్ఞా; భ్రూసంజ్ఞితం; అపాంగదర్శనం; ఇంగితం.
**కనుగిల్పు. కనుగీలు.** వి.చూ. పై.
**కనుగుఁజేప.** వి. మత్స్య విశేషః.
**కనుచీఁకటి.** వి. ఈషదంధకారః; ఈషత్తమిస్రం; ఈషత్తిమిరం; అవతమసం.
**కనుదురు.** వి. చూ. కందురీఁగ.
**కనుపట్టు.** అక. చూ. 2. అగబడు.
**కనుపాప.** వి. నేత్రాంతః ప్రతిబింబః.
**కనుపు.** వి. 1. చూ. 2. అంకపొంకములు. 2. చూ. కణుపు.
**కనుపుగొట్టు.** 1. సక. చూ. 1. అఱవఱ సేయు. 2. అవమానపెట్టు. 3. నిశ్శేషం నాశ్ (ప్రే. నాశయతి); ఉన్మూల్ (నామ. ఉన్మూలయతి).
**కనుపులగుండ్లు.** వి. మణిమయహస్తభూషా విశేషః.
**కనుపెట్టు.** అక. చూ. 3. అఱుము.
**కనుపొట్టలు.** వి. అధరనేత్రచ్ఛదః; అధరాక్షిపుటః.
**కనుబంటి.** వి. తిత్తిరిసదృశః పక్షివిశేషః.
**కనుబాటు.** వి. 1. చూ. కనుకలి. 2. దృష్టిదోషః.
**కనుబడి.** వి. చూ. ఉప్పతి.
**కనుబొమ.** వి. భ్రూః (స్త్రీ); భ్రూలతా.
**కనుఁబ్రాము.** సక. చూ. 2. అటమటించు.
**కనుమ.** వి. 1. వివరం; బిలం; గర్తః; రంధ్రం; ఛిద్రం; కుహరం; శుషిరం; శుషిః (స్త్రీ); శుషీ; కూపః; అవటః-టిః (పుం); గుహా; విరోకం; రోకం; రుహాకం; రోపం; సంకుః (పుం); మర్కరా; భూకం; దూకం; నిర్వ్యథనం. 2. చూ. అడవి. 3. సంకటపథః; సంబాధమార్గః; సంకటవీథిః (స్త్రీ). 4. దరీ-రా; కందరః-రీ; దరిభూః (స్త్రీ); ఉపత్యకా; ద్రోణీ; పర్వతద్రోణీ; అద్రిద్రోణీ; నిమ్నభూః (స్త్రీ); ప్రాంతరం; శైలోపశల్యం; పర్వతద్వయ మధ్యభూమిః (స్త్రీ). 5. తోటభంగగర్తః.
**కనుమరుపు.** వి. 1. చూ. 2. అడ్డపాటు. 2. నేత్రయోరాబద్ధః వస్త్రఖండః.
**కనుమరి.** వి. అయస్కారః; లోహకారః.
**కనుము.** వి. 1. శరః (తృణవిశేషః). 2. మకరసంక్రమణ దివసానంతర దివసః.
**కనుమూయు.** సక. చూ. 2. అటమటించు.
**కనుమూసిగంతలు.** వి. అక్షిమీలనక్రీడా.
**కనుమొరగు.** విశే. అదృశ్యః-శ్యా-శ్యం; తిరోహితః; తిరోభూతః.
**కనుమొఱగు.** సక. చూ. 2. అటమటించు.
**కనురెప్ప.** చూ. కండెఱ.
**కనువిచ్చులు.** చూ. ఉపవడము.
**కనువినికి.** చూ. కంటివిన్కరి.
**కనువిప్పు.** వి. జాగరూకతా; సావధానతా; అప్రమాదః; సయత్నతా.
**కనువెచ్చ.** చూ. ఇసుమంత కాక.
**కన్కని.** వి. చూ. 7. అక్కఱ.
**కన్కిసరు.** వి. కోపయుక్త నేత్రదోషః.
**కన్గంటన్.** అవ్య. ప్రత్యక్షం; సమక్షం.
**కనోజా.** వి. కన్యాకుబ్జదేశభాషా.
**కన్గిలు-పు-ల్పు-గ్గీటు.** చూ. కనుగిలుపు.
**కన్గొను.** సక. చూ. 3. కను.
**కన్నకొడుకు.** వి. ఔరసః; పుత్రః-త్రకః; సుతః; సూనుః; తనయః; నందనః; ఆత్మజః; స్వజః; అంగజః; తను(నూ)జః; దారకః; కుమారః; ఉద్వహః.
**కన్నగాఁడు.** వి. ఖనకః; గ్రంథిభేదకః.
**కన్నడ.** వి. చూ. 5. అలవోక.
**కన్నడము.** వి. కర్ణాటదేశభాషా.
**కన్నడి.** విశే. కర్ణాటః-టీ; కర్ణాటదేశీయః.

**కన్నడించు.** సక. చూ. 1. ఒప్పరికించు.
**కన్నడీఁడు.** వి. 1. ఉపేక్షాశీలః. 2. చూ. కన్నగాఁడు. 3. చూ. కన్నడి.
**కన్నది.** వి. చూ. 2. అప.
**కన్ననాకొడుకు.** వి. భీతః; త్రస్తః.
**కన్నపెట్టు.** వి. రంధ్రంకర్త.
**కన్నపోవు.** అక. కృతరంధ్రః-ధ్రా-ధ్రం-భూ.
**కన్నము.** చూ. 1. కనుమ. 2. చోరేణ భిత్తౌ నిర్మితం రంధ్రం.
**కన్నయ్య.** చూ. 2. అన్న.
**కన్నఱ.** వి. చూ. 7. అంగద.
**కన్నఱి.** విశ. దుఃఖితః; శోకార్తః.
**కన్నళవు.** చూ. 5. అలవోక.
**కన్నవిటి.** చూ. 2. అవిటి.
**కన్నాకు.** విశ. 1. చూ. ఆణిమ. 2. చూ. 4. అనుఁగు. 3. తాంబూలీదలబంధే ప్రథమం పత్రం.
**కన్నాత.** వి. మల్లబంధ విశేషః.
**కన్నాతలు.** వి. మల్లవిద్యా విశేషాః.
**కన్నికగలపులుఁగు.** వి. మయూరః; బర్హిణః; బర్హీ(న్.పుం); శిఖీ (న్.పుం); శిఖావలః; శిఖండీ (న్); కలాపీ (న్); నీలకంఠః; శుక్లాపాంగః; సితాపాంగః; భుజంగభుక్ (జ్); కేకీ (న్); నర్తకః; మేఘానందీ; వర్షామదః; చిత్రమేఖలః; శుక్రభుక్(జ్); శాపరికః; దార్వండః.
**కన్నిక.** వి 1. చూ. అమ్మాయి. 2. చూ. ఆఁడుపడుచు. 3. కన్యారాశిః. 4. చూ. అతివ. 5. విశ. నవః-వా-వం; నూతనః; నూత్నః; నవ్యః; ప్రత్యగ్రః; తరుణః. 6. చూ. 2. అన్నువ.
**కన్నియవేడి.** వి. కారండవః జలవిహంగ విశేషః.
**కన్నీరు.** వి. అశ్రు(న); అస్రు(న); అశ్రం-స్రం; బాష్పః; నేత్రాంబు(న); నయన సలిలం; రోదనం.
**కన్ను.** వి. 1. చూ. ఉక్కివము. 2. చూ. కణుపు. 3. చంద్రకః (శిఖిపింఛస్థః). 4. చూ. 1. కను. 5. చూ. కనుకలి. 6. చూ. అచూకి. 7. (శకట) చక్రం. 8. సేతుముఖం; సేతుద్వారం. 9. మృదంగాది భాండముఖగతం వృత్తనీలమండలం. 10. జాలం; జాలరంధ్రం. 11. శ్రవణాది రంధ్రం.
**కన్నునీరు.** చూ. కన్నీరు.
**కన్నుమొఱగు.** సక. చూ. 2. అటమటించు.
**కన్నులమండ.** వి. చూ. 1. ఇంచు.
**కన్నులమ్రాను.** చూ. పై.
**కన్నులవిలుకాఁడు.** చూ. అంచయేనుఁగు మావంతు.
**కన్నులుగలపక్కి.** చూ. కన్నికగల పులుఁగు.
**కన్నె.** చూ. కన్నియ.
**కన్నెకయ్యము.** వి. ప్రథమ యుద్ధం.
**కన్నెకోమలి.** వి. ఓషధిః (స్త్రీ); ఓషధి మూలం.
**కన్నెబావి.** వి. జలశూన్యో మహాకూపః.
**కన్నెము.** వి. కుక్కుట హృదయం.
**కన్నెరి(ఱి)కము.** వి. 1. కన్యాత్వం. 2. వారకన్యా ప్రథమ సమాగమః.
**కన్నెవేడి (పిట్ట).** వి. కారండవః (పక్షి విశేషః).
**కనోజా.** వి. కన్యాకుబ్జ దేశభాషా.
**కనోటు.** వి. చూ. అంజిక.
**కన్పట్టు.** అక. చూ. 2. అగపడు.
**కన్మొఱగు.** సక. చూ. 2. అటమటించు.
**కన్సన్న.** వి. నేత్రసంజ్ఞా; నేత్రచాలన సంజ్ఞా.
**కపిలె.** వి. ఘటీయంత్ర విశేషః.
**కపురపుటనఁటి.** చూ. పడాకులనఁటి.
**కపురము.** వి. కర్పూరః - రం; చంద్రః; సోమః; సోమసంజ్ఞం; సితాభ్రః; తారాభః; ఘనసారః; హిమవాలుకా

**కపోదా.** వి. శిథిలంధనుః(వ్.న).
**కప్ప.** వి.మణ్డూకః; భేకః; ప్లవః; ప్లవగః; దర్దురః; వ్యంగః; పర్జన్యాభూః(పుం); వర్షాఘోషః; దర్దరీకః; గూఢవర్చాః (స్); అలిమకః; అజిహ్వః; శల్లః; శాలూరః; సాలూరః.
**కప్పకుఱుపు.** వి. పాదమధ్యోగ్గతః గండః.
**కప్పచిప్ప.** చూ. ఆలిచిప్ప.
**కప్పడము.** వి. 1. చూ. ఒలె. 2. కర్పటః; జీర్ణవస్త్రం; చీరం; చీవరం; కంథా; లక్తకం; కరః.
**కప్పతాళము.** వి. తాలయంత్రం; తాలకం; తాలః; అర్గలం; వితండః; ద్వారయంత్రం.
**కప్పనావురు.** వి. క్షుద్రమండూక దంశనజః పంశూనాం రోగవిశేషః.
**కప్పము.** వి. 1. చూ. 2. అప్పన. 2. చూ. 2. అప్పనము.
**కప్పరపడు.** అక. చూ. 2. అగడుపడు.
**కప్పయెలుంగుపాము.** వి. 1. మండూక ధ్వనికారీ సర్పవిశేషః. 2. కృత్రిమ స్వభావః; వంచకః.
**కప్పరము.** వి. 1. చూ. 7. అక్కఱ. 2. చిత్రవర్ణః.
**కప్పలి.** వి. చూ. ఓడ.
**కప్పు.** వి. 1. చూ. 2. అడ్డపాటు. 2. చూ. 2 కందు. 3. చూ. ఇరులు. 4. దంతక్షతం; అధరక్షతం. 5. సక. చూ. 2. అప్పళించు. 6. అక. చూ. 4. అడరు.
**కప్పుఁగుత్తుకపుల్గు.** చూ. కన్నికగలపులుఁగు
**కప్పుఁటేటిగొంగ.** వి. చూ. ఒంటిపోగు.
**కప్పుతైదువ పెనిమిటి.** చూ. అంగమొల వేల్పు.
**కప్పుడు.** చూ. 2. అడ్డపాటు.
**కప్పుతెరవుజాడ.** చూ. అంటని జేజే.
**కప్పుతెరవుదారి.** చూ. పై.
**కప్పుత్రోవరి.** చూ. పై.
**కప్పుఁదెరువరి.** చూ. పై.
**కప్పుదెంచు.** అక. చూ. 4. అడరు.
**కప్పుబల్ల.** వి. ద్వారోపరిదారుఫలకం.
**కప్పుమల.** వి. అంజనాద్రిః.
**కప్పుమేనిగాము.** వి. శనిః; మందః; సౌరిః.
**కప్పురగంధి.** వి. కర్పూర సదృశ గంధవతీ(స్త్రీ).
**కప్పురపుటనఁటి.** వి. చూ. కపురపుటనఁటి.
**కప్పురపుబెండ.** వి. గంధమూలా; కచ్చూరః; ద్రావిడః; దుర్లభః.
**కప్పురపువంగ.** వి. కూటవార్తాకీ.
**కప్పురము.** చూ. కపురము.
**కప్పుఱాలు.** వి. నీలః; నీలకాంతః; నీలాశ్మ (న్); ఇంద్రనీలః; తృణగ్రాహీ (న్); శితిరత్నం; శనిః.
**కప్పెర.** వి. 1. చూ. కట్టెర. 2. ఖర్పరః; భిక్షాపాత్రం.
**కప్రము.** చూ. కపురము.
**కప్రములత.** వి. కూటవార్తాకీ.
**కబాడము.** వి. వృషభ పృష్ఠే నిధాయ ఆనీయమానం బంధద్వయం.
**కబాయి(యీ).** చూ. అంగరక.
**కబ్బపుఁగూరుపరి.** వి. కవిః; కావ్యకర్తా (ఋ); కవయితా (ఋ).
**కబ్బపుసేతరి.** చూ. పై.
**కబ్బము.** వి. 1. కావ్యం; కృతిః (స్త్రీ), 2. గ్రంథః; ప్రబంధః.
**కబ్బిలి.** వి. 1. సురావిక్రేతా (ఋ).
**కమండలము.** వి. కమండలుః(పుం)-లు(న)
**కమటము.** చూ. ఇనుపగోలెము.
**కమతకాఁడు.** చూ. అరకాఁడు.
**కమతము.** వి. కృషిః (స్త్రీ); కర్షణం; హాలభృతిః(స్త్రీ); వైశ్యవృత్తిః(స్త్రీ); వైశ్యక్రియా.
**కమఠీఁడు.** వి. చూ. అరకాఁడు.

# మి

**మింగడ.** 1. పయోమండం. 2. దధిమండం.

**మింగనగొండి.** చూ. ఆబూతికాఁడు.

**మించిలి.** చూ. జిబిలిక.

**మించు.** వి. 1. విద్యుత్ (స్త్రీ); తడిత్; సౌదామి(మ)నీ; సౌదామ్నీ; మేఘజ్యోతిః (స్.న); ఘనజ్వాలా; క్షణప్రభా; హ్రాదినీ; హ్రాదినీ; శతహ్రాదా; శమ్యా; సన్యా; చపలా; చంచలా; అకాలికీ; చలా; ఐరావతీ; ఛటాభా; రోహిణీ; అణుభా; అశుభా; వజ్రస్ఫులింగః-గం; ఘనవల్లికా; వీపా; మహోల్కా; అతిభీః(స్త్రీ); చటులా; రుక్(చ్.స్త్రీ); నీలాంజనా. 2. చూ. 2. కళుకు. 3. చూ. 3. జోతి; 4. చూ. 5. అగ్గలిక. 5. చూ. మట్టియ. 6. అక. చూ. 5. అడరు. 7. చూ. మట్టుమిగులు. 8. చూ. 2. అంగవించు.

**మించుగాలు.** వి. దక్షిణపాదః.

**మించుదల.** వి. 1. అతిక్రమణం. 2. చూ. 5. అగ్గలిక.

**మించుబోఁడి.** 1. చూ. అంచయాన. 2. చూ. అతివ.

**మింటముక్కిడివల.** చూ. 1. ఊఁత.

**మింటిచూలి.** చూ. 1. ఈఁదు.

**మింటిఁజెట్టు.** వి. చూ. ఈఁగిమ్రాను.

**మింటితెరువరి.** చూ. ఇరులుగొంగ.

**మింటితెరువరులు.** చూ. అంకులు.

**మిండ.** 1. చూ. అవికిరి. 2. 'మిండతపసి' ఇత్యాదివృత్తౌ మిండడు ఇత్యస్య పరిశిష్టరూపం.

**మిండకోర.** చూ. అంటిగది.

**మిండగాఁడు.** 1. చూ. అంటుగాఁడు. 2. చూ. 1. మగఁడు.

**మిండగీఁడు.** 1. 2. చూ. పై. 3. చూ. పెటమగఁడు.

**మిండఁడు.** 1. 3. చూ. పై. 4. చూ. అక్కజుఁడు.

**మిండత.** చూ. అంటిగది.

**మిండలకోర(రి).** చూ. పై. షట్త్రింశద్వర్షా స్త్రీ.

**మిక్కటము.** చూ. 4. అంకపొంకములు.

**మిక్కిణ.** చూ. అయిదువ.

**మిక్కిలి.** 1. చూ. అగ్గలము. 2. చూ. 4. అంకపొంకములు. 3. చూ. అణిమ.

**మిక్కిలికంటివేల్పు.** చూ. అంగమొలవేల్పు.

**మిక్కిలికను(న్ను).** ఫాలనేత్రం.

**మిక్కిలివాఁడు.** చూ. అక్కజుఁడు.

**మిక్కిలి.** అక. చూ. 2. అంగవించు.

**మిక్కుటము.** 1. చూ. 1. అగ్గలము. 2. చూ. 4. అంకపొంకములు.

**మిగత.** చూ. 3. ఒడుపు. 2. చూ. 4. అంకపొంకములు. 3. చూ. 3. కడమ.

**మిగితి.** 1. చూ. 3. ఒడుపు. 2. చూ. 4. అంకపొంకములు. 3. చూ. 3. కడమ.

**మిగులు.** 1. చూ. 3. ఒడుపు. 2. చూ. 3. కడమ. 3. అక. చూ. 7. అడరు. 4. చూ. మట్టుమిగులు. 5. చూ. 3. ఉండు.

**మిగులుచు(ల్చు).** ప్రే. శిష్ (ప్రే. శేషయతి); శిష్టం కృ.

**మిటారము.** 1. చూ. 1. అగ్గలము. 2. చూ. 3. అగ్గలిక.

**మిటారి.** 1. చూ. అంచయాన. 2. చూ. అతివ. 3. విణ. మదవతీ. 4. ఉన్నతః-తా-తం. 5. చూ. ఎమ్మెలాఁడి.

**మిటారించు.** 1. అక. చూ. 6. తొంగలించు. 2. చూ. 6. అడరు. 3. చూ. 2. అంగ వించు.
**మిటారింపు.** చూ. 3. అగ్గలిక.
**మిట్ట.** 1. చూ. అగరుట. 2. చూ. 2. ఇంకువ. 3. చూ. ఉతాణి.
**మిట్టపండ్లు.** వి. ఉన్నతాః దంతాః.
**మిట్టపండ్లవాఁడు.** వి. దంతురః; ఉన్నత దంతః.
**మిట్టమిఖ్ఖు.** వి. 1. అత్యున్నతభూమిః. 2. అత్యున్నతతా.
**మిట్టాడు.** అక. చూ. 8. ఆడు.
**మిట్టించు.** అక. చూ. 2. ఉంకు.
**మిట్టిపడు.** } అక. చూ. పై.
**మిట్టు.**
**మిట్టిపాటు.** చూ. 1. అదటు.
**మితాయి.** వి. మధురభక్ష్యవిశేషః.
**మిడి.** 1. చూ. 1. అదటు. 2. విణ. గర్వితా; దృప్తా. 3. చూ. ఉతాణి. 4. చూ. అగరుట.
**మిడిగ్రుడ్లవాఁడు.** వి. ఉన్నేత్రః.
**మిడిగ్రుడ్లు.** వి. (బవ) ఉద్గతకనీనికా.
**మిడినాగు.** వి. ఉత్పాతీ సర్పవిశేషః.
**మిడిపండ్లు.** చూ. మిట్టపండ్లు.
**మిడిపండ్లవాఁడు.** చూ. మిట్టపండ్లవాఁడు.
**మిడిబోనులు.** చూ. 1. బండగు.
**మిడిమాసి.** చూ. ఉక్కడీఁడు.
**మిడిమేలము.** 1. చూ. ఉక్కళుఁడు. 2. చూ. 1. అదటు.
**మిడియ.** వి. వేదవాక్యం.
**మిడియు.** అక. 1. చూ. 2. ఉంకు. 2. బహి రుత్పత్ (1గ. పతతి-పతితుం-త).
**మిడివోవు.** అక. 1. చూ. ఉజ్జగిల్లు. 2. చూ. గెంటువడు.
**మిడిసిపడు.** అక. చూ. 2. ఉంకు.
**మిడిసిపాటు.** వి. చూ. 1. అదటు.
**మిడుకు.** 1. చూ. దేవరింపు. 2. చూ. 1. ఉసులు. 3. అక. చూ. 3. బ్రతుకు. 4. చూ. 2. ఉంకు. 5. చూ. 1. అటమటించు. 6. చూ. 8. ఆడు. 7. చూ. ఆరటపడు. 8. చూ. 1. ఎండు.
**మిడుకుమాలు.** అక. చూ. 2. ఉంకు.
**మిడుగు.** వి. కఠోరశిలా.
**మిడుగుఱాయి.** చూ. పై.
**మిడుఁగురుపురువు.** వి. ఖద్యోతః; ఖజ్యోతిః (స్. పుం); జ్యోతిరింగం; జ్యోతిరింగణం; ప్రభాకీటః; జ్యోతిర్బీజం; గుహ్యాదీపకః; ధ్వాన్తోన్మేషః; చిలిమిలికా.
**మిఁడుగుఱు.** చూ. పై.
**మిఁడుగుఱులు.** చూ. అదురులు.
**మిఁడుగులు.** చూ. పై.
**మిడుచు.** 1. సక. బిందురూపేణ స్రంస్ (ప్రే. స్రంసయతి). 2. అంగులీ మవనమ్య శబ్దం కృ.
**మిడుత.** చూ. దివ్వార్పు పులుఁగు.
**మిడునాగు.** చూ. మిడినాగు.
**మిడుమిడుకను.** అక. చూ. ఆరటబడు.
**మిణకరము.** వి. కింకర్తవ్యతామోహేన భ్రాన్తిః. (స్త్రీ).
**మిణకరించు.** అక. చూ. నవ్వుకొట్టు.
**మిణుఁగుఱులు.** చూ. అదిరులు.
**మిణుఁగులు.** చూ. పై.
**మిత్త.** చూ. 2. అంటు.
**మిత్తి.** 1. చూ. గుదియతాలుపు. 2. శంఖపుష్పికా. 3. చూ. ఈలుగుట.
**మిత్తిక.** చూ. 2. పారి.
**మిత్తిగొంగ.** చూ. అంగమొలవేల్పు.
**మిత్తిచూలు.** చూ. కెక్కెపుగాము.
**మిత్తిమిత్తి.** చూ. అంగమొలవేల్పు
**మిత్తివేటకాఁడు.** చూ. పై.
**మిదిల.** వి. మిథిలా; జనకస్య రాజధానీ.

మిద్దియ. చూ. 1. మాడుగు.
మిద్దె. 1. చూ. పై. 2. చూ. తామరదుద్దు. 3. అంగుళీయకోపర్యున్నతోభాగః.
మిన. చూ. 1. ఒప్పు.
మినమిన. చూ. 1. జగ్గు.
మినమిననివాఁడు. చూ. గరగరనివాఁడు.
మినమినలాడు. అక. కించిత్కాంత్ ప్రకాశ్ (1గ. కాశతే-శితుం-త).
మిను. చూ. అప్పుతాత.
మినుకు. 1. చూ. 2. కళుకు. 2. చూ. తాలిబొట్టు. 3. సువర్ణనాణక విశేషః. 4. కించిత్ప్రభా. 5. అక. చూ. మినమినలాడు.
మినుకుఁజేడియ. చూ. అంచతత్తడిచెలియ.
మినుకుతెపవపులు. చూ. అంకులు.
మినుకుమినుకుమను. అక. చూ. మినమినలాడు.
మినుకులదణి. చూ. అంచరవుతు.
మినుకులపరణి. చూ. ఇరులుగొంగ.
మినుకులయిక్క. చూ. పై.
మినుకులు. 1. చూ. 2. జాస. 2. చూ. ఉడివోని పల్కులు.
మినుక్కురను. అక. చూ. మినమినలాడు.
మినుఁగుఋలు. చూ. అదరులు.
మినుచూలు. చూ. 1. ఈఁదు.
మినుపపోలిక. వి. భక్ష్యవిశేషః.
మినుమినుకను. అక. చూ. మినమినలాడు.
మినుములు. వి. ధాన్యమాషః; మాషకః.
మినువాఁకతోఁబుట్టువు. చూ. 2. అడుగుపుట్టువు.
మినుసికగలాఁడు. చూ. అంగమొలవేల్పు.
మినుసిగవేల్పు. చూ. పై.
మినుకులచదువరి. చూ. 1. అయ్యవారు.
మిన్న. 1. చూ. 1. ఒడమి. 2. చూ. 2. పూస. 3. చూ. 2. చందమామ. 4. చూ. ఆణిమ.
మిన్నక. చూ. ఉరక.
మిన్ను. చూ. అప్పుతాత.
మిన్నుకొలఁకు. చూ. అంచలవిడిది.
మిన్నుమన్ను. వి. ద్యావాపృథివ్యౌ; రోదస్యౌ.
మిన్నువాఁక. చూ. అంచలవిడిది.
మిన్నేఱు }
మిన్వాఁక } చూ. పై.
మిమ్మటము. చూ. 4. అంకపొంకములు.
మీరిమిడి. చూ. తళతళ.
మిరియము. వి. వహ్నిజం; యవనేష్టం; మరీచం; మరిచం; తీక్ష్ణం; ఊషణం.
మిరెపకాయ. వి. బృహన్మరీచం.
మిరెము. చూ. మిరియము.
మిర్మిట్లు. వి. అతీవోత్పతనం(దృశోః. అధికకాంతి దర్శనేన).
మిఱిమిఱి. చూ. 1. మించు. 2. చూ. తళతళ.
మిఱుమిట్లులు. చూ. మిర్మిట్లు.
మిఱుమిట్లుగొను. అక. చూ. చిరుచలుకవియు.
మిఱ్ఱు. 1. చూ. ఉరాణి. 2. చూ. 2. ఇంకువ.
మిఱ్ఱుచూపు. వి. ఊర్ధ్వదృష్టిః (స్త్రీ).
మిఱ్ఱెడు. చూ. 4. అంచు.
మిలమిల 1. చూ. 1. జగ్గు. 2. చలనాద్యనుకరణం.
మిలమిలలాడు. అక. చూ. మినమినలాడు.
మిలు. చూ. చేపలు.
మిల్లి(ల్లి). వి. క్షుద్రా పక్షీ.
మివులు. అక. చూ. మట్టుమిగులు.
మిస. వి. కాంతివిశేషః.
మిసమిసమను. అక. మిసమిసేతి ప్రకాశ్ (1గ. కాశతే-శితుం-త).
మిసి. వి. మత్స్యవిశేషః.

**మిసిమి.** వి. 1. నూత్నకాంతిః (స్త్రీ). 2. నవనీతం; క్షీరసారః; దధిజం; దధిసారః; కిలాటః-టీ; మంథజం; నవోద్ధృతం. 3. చూ. 1. నయగారము.

**మిసిమింతుఁడు.** వి. శ్రాంతః; క్లాంతః; గ్లానః; ఖిన్నః.

**మిసిమింతురాలు.** వి. శ్రాంతా; క్లాంతా; గ్లానా; ఖిన్నా.

**మిసుకు** అక. చూ. 1. అటమటించు.

**మిహి.** 1. చూ. అణిమ. 2. చూ. నయగారము. 3. చూ. 5. కన్నియ. 4. చూ. పచరణ.

## మీ

**మీ.** 'మీదు' శబ్దస్య వృత్తౌ అంత్యలోపేన రూపం.

**మీఁగండ్లమెకము.** చూ. అడిదపుమెకము.

**మీఁగడ.** చూ. మింగడ.

**మీఁగడపెరుఁగు.** వి. సమండం దధి (న); (శ్రీ)ఘనం.

**మీఁగాలు.** వి. పాదోపరిభాగః.

**మీఁజేయి.** వి. కరోపరిభాగః.

**మీట.** చూ. 1. బిస.

**మీటు.** 1. చూ. 4. అంకపొంకములు. 2. చూ. ఒడికారము. 3. చూ. 1. అగ్గలము. 4. సక. ఉత్‌క్షిప్ (6గ. క్షిపతి-క్షేప్తుం-క్షిప్త). 5. చూ. 2. ఊటు. 6. చూ. 1. అంటించు.

**మీఁదసాకిరి.** వి. ఉత్తరసాక్షీ (న్. పుం).

**మీఁదు.** 1. వి. పరః; ఉత్తరః. 2. చూ. 2. ఉప్పరము. 3. భవిష్యత్కాలః. 4. దేవతార్థం పృథక్ నిక్షిప్తం ధనాదికం.

**మీదుమిక్కిలి.** విణ. అత్యధికః-కా-కం.

**మీద్ద.** చూ. అవికిరి.

**మీనవల్లంకి.** వి. ఝటితిజలే నిపత్యమత్స్యగ్రాహీ పక్షివిశేషః.

**మీనురూపురిక్క.** చూ. కడచుక్క

**మీనులు.** చేఁపలు.

**మీనుమొసలిడెంబులమేటి.** చూ. అంచయేనుఁగుమావంతు.

**మీఱు.** 1. 2. అక. చూ. 6. 7. అదరు. 3. చూ. 1. గతపడు. 4. సక. చూ. 2. అంగవించు.

**మీలదొంగ.** చూ. మీనవల్లంకి.

**మీలముచ్చు.** చూ. పై.

**మీలు.** చూ. మిలు.

**మీవడ.** చూ. మింగడ.

**మీస(ము).** వి. శ్మశ్రు (న్. న); గుంఫః; ఓష్ఠలోమ (న్. న).

**మీసకట్టు.** వి. శ్మశ్రుబంధః.

**మీసర.** చూ. జాబిలిరిక్క

**మీసరము.** చూ. అణిమ.

## ము

**ము.** 1. మూడు శబ్దస్య వృత్తౌ అంత్యలోపాది కృతంరూపం. 2. ముందుశబ్దస్య వృత్తౌ అంత్యలోపాదికృతం రూపం.

**ముంగ.** వి. 1. కణిశానాం బంధః. 2. చూ. నోరుమెంగ.

**ముంగడ.** 1. చూ. 1. ఎదురు. 2. చూ. 5. తొలి.

**ముంగతనము.** చూ. 2. తఱటు.

**ముంగమురము.** వి. హస్తభూషణం.

**ముంగ(యి)మురాది.** చూ. పై.

**ముంగర.** చూ. అడ్డబాస.

**ముంగల.** చూ. ముంగడ.

**ముంగలన్.** అవ్య. 1. పురా. (అవ్య); పూర్వం (క్రి. విణ). 2. పురః (అవ్య); పురతః (అవ్య).

**ముంగలి.** విశ.1. పురోగామీ-మినీ-మి. 2. ఉప...-నా-నం; ఉపరిస్థః.

**ముంగలు.** అక. పురోగమ్ (1గ. గచ్ఛతి-గంతుం-గత).

**ముంగాము.** వి.1. పుటీకృతం తాలపత్రం. 2. గుడాది భారవిశేషార్ధం.

**ముంగాముచీర.** వి. స్త్రీణాం వల్కల విశేషః

**ముంగామురము.**
**ముంగామురారి.** } చూ. ముంగమురము.
**ముంగామురుగు.**

**ముంగాలు.** వి. పాదాగ్రం; ప్రపదం.

**ముంగి.** వి. నకులః; అంగూషః; బభ్రుః; సూచివదనః.

**ముంగిలి.** 1. చూ. అంగళ. 2. 3. చూ. 1. 2. అంకణము. 4. మధ్యప్రదేశః.

**ముంగిస.** చూ. ముంగి.

**ముంగిసమ్రాను.** వి. నకులముఖాకారః జలయంత్ర స్తంభాగ్రభాగః.

**ముంగుఱులు.** చూ. 2. కురులు.

**ముంగేలు.** వి. ప్రకోష్ఠః; ప్రవేష్టః; కలాచికా; అగ్రబాహుః (పుం); అగ్రభుజః.

**ముంగై మురారి.** చూ. ముంగమురము.

**ముంగొంగు.** వి. వస్త్రాంచలం; చేలాంచలం

**ముంగొన.** వి. పురతః అగ్రం.

**ముంగోపము.** వి. శీఘ్రకోపః

**ముంగోపి.** వి. శీఘ్రకోపీ (న్. పుం).

**ముంగోలు.** చూ. 2. అనుఁగు.

**ముంచు.** ప్రే. మజ్జ్ (ప్రే. మజ్జయతి).

**ముంచుకొను.** అక. ఆక్రమ్ (1గ. క్రామతి-క్రమతే - 4గ. క్రామ్యతి - క్రమితుం-క్రాంత).

**ముంజి.** చూ. గడ్డిమొలత్రాడు.

**ముంజికాఁడు.** చూ. ఒంటిజందెపువాఁడు.

**ముంజూరు.** చూ. కొణిగ.

**ముంజె.** వి. తాలశలాట్వంతర్గతః భక్ష్యోభాగః.

**ముంజెయి(య్యి).** 1.చూ.ముంగేలు. 2.చూ. మడికట్టు.

**ముంజెరమ.** చూ. చెరమ.

**ముంటఁజీలు(చ్చు).** సక. చూ. పొంజు.

**ముండ.** చూ. 1. అనద.

**ముండమోపి.** చూ. పై.

**ముండమోయు.** 1. అక. విధవా భూ. 2. చూ. 1. ఆఁబడిపడు.

**ముండరి.** చూ. అంటుగాఁడు.

**ముండలమారి.** చూ. పై.

**ముండలు.** చూ. ఆటవెలఁది.

**ముండ్లకంచె.** వి. కంటకావేష్టకః.

**ముండ్లపంది.** చూ. 1. ఏదు.

**ముండ్రెము.** చూ. 2. అట్ట.

**ముంత.** వి.1. దారుపాత్రం. 2.చూ.నవల.

**ముంతపొగ.** వి. బృహన్మరిచాదీనాం పాత్రధూమః.

**ముంతమామిడి.** వి. అగ్రబీజః (వృషని).

**ముందర(ఱ).** 1. చూ. 5. తొలి. 2. చూ. 1. ఎత్తనగోలు. 3. చూ. 1. ఎదురు.

**ముందల.** చూ. ఔదల.

**ముందు.** 1.చూ.5. తొలి. 2.చూ.1. ఎదురు.

**ముందున్.** అవ్య. చూ. ముంగలన్.

**ముందగు.** అక. పురో భూ.

**ముంపు.** 1. వి. మజ్జనం. 2. చూ. అంటలు.

**ముంపుగొను.** అక. చూ. దాఁటుకట్టు.

**ముకు.** 1. వి. నాసా; నాసికా; నసా; నస్యం; ఘ్రాణం; ఘోణా; గంధవహా; గంధజ్ఞా; గంధనలీ; ఘ్రుతిః (స్త్రీ); నాః (స్. స్త్రీ); నస్తః; నాసిక్యం; సింఘినీ; వికూణికా; తనుభస్త్రా; నక్రం; నకుటం; నర్కుటకం. 2. చంచుః (స్త్రీ); చంచూః (స్త్రీ); త్రోటీ-టిః(స్త్రీ); ముఖం; తుండిః

(పుం); తుండః. 3. అక. కష్టకార్య కరణసమయేశ్వాసం నిరుధ్(7గ. రుణద్ధి-రోద్ధుం-రుద్ధ).

**ముకుఁగోళ్లు.** చూ. చెరమ.

**ముకుఁగ్రోళ్లు.** } చూ. పై.
**ముకుఁజెఱమ.** }

**ముకుటము.** చూ. నారుమడి.

**ముకుదూలము.** వి. నాసామధ్యాస్థి (న).

**ముకుదొమ్మి.** మత్స్యవిశేషః.

**ముకుఁద్రాడు.** వి. నాసారజ్జుః(స్త్రీ).

**ముకుబంతి.** వి. గవాంనాసోద్గత కేశావృత పిండరూపరోగవిశేషః; నాసాపిండం.

**ముకులు.** చూ. అంచులు.

**ముక్క.** చూ. 1. అరవరలు.

**ముక్కంటి.** వి. త్రినేత్రః. చూ. అంగమొల వేల్పు.

**ముక్కంటిచుక్క.** వి. ఉత్తరభాద్ర పద్ (స్త్రీ)-దా.

**ముక్కంటిచెలి.** వి. త్రిణయనసఖః. చూ. కాయకంటి.

**ముక్కంటిపండు.** చూ. కొబ్బరికాయ.

**ముక్కంటిమల.** చూ. తెల్లగుబ్బలి.

**ముక్కంటిమావు.** చూ. అచ్చుకెద్దు.

**ముక్కఁడి.** వి. 1. సాంక్రామికరోగః యః అనేకేషాం ఏకదైవభవేత్. 2. ఆహారార్థం గమనసమయే హాలికైః ఏకత్ర నిహితానాం హాలదండానాం సముదాయః.

**ముక్కద్దము.** వి. ఉపనేత్రం; సులోచనం; దృష్టిసహాయః; దృష్టిసాహాయ్యకకాచః.

**ముక్కన్ను.** వి. తృతీయనేత్రం.

**ముక్కర(ఱ).** చూ. అడ్డబాస.

**ముక్కరము.** చూ. చెరమ.

**ముక్కలిపీఁట.** వి. త్రిపాదపీఠం.

**ముక్కస.** వి. ప్రస్థత్రయం.

**ముక్కాక.** వి. క్వాథనత్రయం.

**ముక్కాలిపీఁట.** చూ. ముక్కలిపీఁట.

**ముక్కాలు.** వి. పాదత్రయం.

**ముక్కిఁడి.** వి. విగ్రః; విగతనాసికః.

**ముక్కిడి.** వి. వృక్షవిశేషః.

**ముక్కు.** 1-3. చూ. 1-3. ముకు. 4. చూ. 4. అడఁగు.

**ముక్కుకొయ్య.** వి. బాధాకరః.

**ముక్కుఁగమ్మి.** చూ. అడ్డబాస.

**ముక్కుఁగ్రోళ్లు.** చూ. చెరమ.

**ముక్కుఁజెఱమ.** చూ. పై.

**ముక్కుటము.** చూ. నారమడి.

**ముక్కుదాడిమ.** వి. వృక్షవిశేషః.

**ముక్కుదూలము.** చూ. ముకుదూలము.

**ముక్కుఁద్రాడు.** చూ. ముకుఁద్రాడు.

**ముక్కుపోఁగు.** చూ. అడ్డబాస.

**ముక్కుపూరెడు.** వి. పక్షివిశేషః.

**ముక్కుపొడి.** వి. నాసాచూర్ణం.

**ముక్కుముంగర.** వి. వృక్షవిశేషః.

**ముక్కులు.** 1. చూ. అంచులు. 2. అతిక్షుద్రతండులఖండాః. 3. భక్ష్యవిశేషః.

**ముక్కుస.** వి. ప్రస్థత్రయం.

**ముక్కూరు.** అక. అజ్ఞః భూ; ముహ్(4గ. ముహ్యతి-మోహితుం-మూఢ).

**ముక్కొటిక.** వి. పురత్రయం.

**ముక్కొను.** అక. అగ్రే భూ; ప్రథమతః భూ.

**ముక్కొమ్ముమెకము.** చూ. బిళ్లదున్న.

**ముక్కొటికలకంటు.** చూ. అంగమొల వేల్పు.

**ముక్కోణము.** వి. త్రికోణం.

**ముక్కోల.** వి. త్రిదండః.

**ముత్తసరి(రు).** వి. సంగ్రహః; సంక్షేపః.

**ముగండి.** చూ. 1. ముక్కఁడి.

**ముగము.** వి. ముఖం; వదనం; ఆస్యం; వక్త్రం; ఆననం; లపనం; తుండః-డం; తుండిః(పుం); తుండీ; శ్మశ్రు (అవ్య).
**ముగతి.** చూ. అయిదువ.
**ముగింపు.** చూ. 1. తీఱుగడ.
**ముగితి.** చూ. పెంద్రోవ.
**ముగియిక.** చూ. 1. తీఱుగడ.
**ముగియు.** అక. 1. చూ. ఇలుగు. 2. చూ. 1. అయిపోవు.
**ముగుద.** 1. చూ. అతివ. 2. చూ. 4. గోల.
**ముగురు.** సర్వ. త్రయః(పురుషాః); త్రిసః
**ముగ్గ.** వి. వృక్షవిశేషః.
**ముగ్గు.** 1. చూ. పరిక. 2. అక. శలాటుః పక్వః భూ.
**ముగ్గురు.** చూ. ముగురు.
**ముగ్గొయ్య.** వి. 1. అగ్రదండః. 2. చూ. 6. గండు.
**ముచ్చ.** 1. చూ. టికము. 2. చూ. తిగ.
**ముచ్చంగి.** వి. మత్స్యవిశేషః.
**ముచ్చట.** 1. చూ. 1. ఉబుసు. 2. చూ. గుసగుస. 3. చూ. 1. అంటు. 4. చూ. 1. అక్కఱ.
**ముచ్చటకాఁడు.** వి. అభిలాషుకః; ఇచ్ఛుః.
**ముచ్చటపడు.** అక. చూ. 4. ఇంచు; ఇచ్ఛావాన్ భూ; ఇచ్ఛుకః భూ.
**ముచ్చటించు.** అక. సంలాపం కృ; సంభాషణం కృ.
**ముచ్చట్లు.** ప్రదేశత్రయం.
**ముచ్చముడుగు.** అక. అతీవ సంకుచ్ (6గ. కుచతి-కోచితుం-కుచిత).
**ముచ్చి.** చూ. అంచులవాఁడు.
**ముచ్చిక.** వి. నారికేల తాలాది ఫలానాం వృంతమూలం.
**ముచ్చిచ్చు.** వి. త్రేతాగ్నిః.
**ముచ్చిరి.** విఅ. 1. కుపితః; క్రుద్ధః. 2. దుఃఖితః.
**ముచ్చితనము.** చూ. 2. అంగద.
**ముచ్చిరు.** 1. చూ. 2. అంగవించు. 2. చూ. 1. అంగలారుచు.
**ముచ్చిలి.** వి. అవటుః(పుం); శిరః పశ్చాద్భాగే గర్తః.
**ముచ్చిలిగుంత.** చూ. పై.
**ముచ్చిలిక.** 1. చూ. 2. ఒడంబడిక. 2. భూస్వామినే కర్షకేణ దత్తం పత్రం.
**ముచ్చిలిపాటు.** చూ. కునికిపాటు.
**ముచ్చిలించు.** సక. చూ. 4. అంకించు.
**ముచ్చిలు.** చూ. పై.
**ముచ్చివుక.** వి. వరహాఖ్యనాణకస్య షోడశభాగానాం త్రయం.
**ముచ్చు.** 1. చూ. టికము. 2.చూ. ఎతుబరికాఁడు. 3.చూ.2. దొంగ.
**ముచ్చె.** 1. చూ. ఆకుచెప్పు. 2 పార్ష్ణిత్రా.
**ముచ్చెబంగారు.** చూ. కాకిబంగారు.
**ముచ్చెవాఁడు.** చూ. గొడగరవాఁడు.
**ముచ్చొకము.** చూ. ఇరాటు.
**ముజరా.** వి. ప్రతినివర్తితం (ధనాదికం).
**ముజ్జగము.** వి. త్రిభువనం.
**ముటము.** వి. పిండకరీషః-షం.
**ముటాలు.** వి. ముద్రాబంధాః.
**ముట్టడము.** 1.చూ. 9. కట్టు. 2. అవరోధః; అక్రమణం.
**ముట్టడి.** చూ. పై.
**ముట్టడించు.** సక. రుధ్ (7గ. రుణద్ధి - రోద్ధుం-రుద్ధ); ఉపరుధ్; అక్రమ్ (1గ. క్రామతి-క్రమితుం-క్రాంత).
**ముట్టణము.** చూ. ముట్టడము.
**ముట్టఁబడు.** అక. చూ. ఎత్తుపడు.
**ముట్టించు.** 1. ప్రే. స్పృశ్ (ప్రే. స్పర్శయతి). 2. చూ. కమరుచు. 3. తప్ (ప్రే. తాపయతి); ప్రదీప్ (ప్రే. దీప

యతి); జ్వల్ (ప్రే. జ్వలయతి); సమింధ్ (7గ. ఇంధే-ఇంధితుం-ఇద్ధ); సంధుక్ష్ (ప్రే. ధుక్షయతి).

**ముట్టిగాళ్లవాఁడు.** చూ. గాడిదకాళ్లవాఁడు.

**ముట్టియ.** చూ. పందిపీఁట.

**ముట్టు.** 1. చూ. 7. అంటు. 2. చూ. 1. తాఁకు. 3. స్త్రియాః రజః(స్.న). 4. చూ. ఎత్తళి. 5. సక. చూ. 12. అంటు. 6. చూ. ముట్టడించు. 7. చూ. 1. అయిపోవు.

**ముట్టుకొను.** 1. సక. చూ. ముట్టడించు. 2. చూ. 4. అప్పళించు.

**ముట్టుకోలు.** చూ. ముట్టడము.

**ముట్టుకోలుకొను.** సక. చూ. ముట్టడించు.

**ముట్టుకోలువట్టు.** సక. చూ. పై.

**ముట్టుకోలుపఱచు**
**ముట్టుకోల్గొను** } చూ. పై.

**ముట్టుత.** చూ. చెఱఁగుమాసినది.

**ముట్టునీళ్లు.** వి. రజస్వలాయాః చతుర్థదివసే స్నానం.

**ముట్టుపడు.** అక. చూ. ఇంట్రపడు.

**ముట్టుపాటు.** చూ. అనరు.

**ముట్టుసందు.** వి. బహిర్గమనమార్గశూన్యా సంకటా వీథీ.

**ముట్టె.** 1. చూ. పందిపీఁట. 2. పశ్వాదీనాం ముఖం.

**ముట్టెచేప.** వి. మత్స్యవిశేషః.

**ముట్టెమెకము.** చూ. ఊటమెకము.

**ముట్టెమోపు.** వి. కార్యనిర్వాహసమయః.

**ముట్లచవిక.** వి. రజస్వలావాసః.

**ముట్లుడిగినది.** వి. నిష్కలా; విగతార్తవా.

**ముఠా.** వి. కేషాంచిద్ గ్రామాణాం సంఘః.

**ముడి.** 1. చూ. 1. కంతి. 2. సూత్రాదీనాం గ్రంథిః(పుం). 3. చూ. 4. గంటు. 4. కకుత్(ద్.స్త్రీ); కకుదః - దం; అంసకూటః. 5. చూ. అరివేరము. 6. చూ. 9. ఎడ. 7. చూ. కుట్టియ. 8. విణ. అఖండః-డా-డం. 9. విణ. అవికసితః-తా-తం; ముకులితః-తా-తం.

**ముడికాఁడు.** 1. చూ. కావరి. 2. సంధాతా (ఋ.పుం).

**ముడికాళ్లవాఁడు.** చూ. గాడిదకాళ్లవాఁడు.

**ముడికొక్కు.** వి. కీటవిశేషః.

**ముడిగిబ్బ.** చూ. 1. ఆఁబోతు.

**ముడిగొను.** సక. గ్రంథిం కృ; గ్రంథ్(1గ. గ్రంథతి-థితుం-థ).

**ముడిచె.** చూ. 1. ముక్కఁడి.

**ముడిబట్ట.** వి. అంచలేరేఖాశూన్యం వస్త్రం.

**ముడిబొమ.** వి. కుటిలాభ్రూః (స్త్రీ).

**ముడియ.** 1. చూ. 4. ఒడ్డనము. 2. చూ. చిప్పము.

**ముడియవిడుపు.** చూ. కన్నగాఁడు; గ్రంథిభేదకః.

**ముడివడు.** సక. 1. గ్రంథిలః భూ; గ్రంథిరూపేణ సంశ్లిష్టః భూ. 2. చూ. తెఱగుపడు. 3. చూ. అల్లిబిల్లికొను. 4. చూ. 7. అడరు. 5. చూ. 9. అడరు.

**ముడివాటు.** వి. గ్రంథిలీభవనం; గ్రంథిలతా.

**ముడివెట్టు.** సక. చూ. ముడిగొను.

**ముడుకు.** వి. జానుః (పుం)-ను (న); అష్ఠీవాన్ (పుం)-వత్(న); ఊరుపర్వ(న్.న); జంఘోరుసంధిః (పుం); కుర్పరః; కూర్పరః; నలకీలః; పర్వకం; చక్రికా.

**ముడుఁగఁబాఱు.** అక. చూ. 1. కోరగించు.

**ముడుఁగు.** అక. 1. చూ. పై. 2. చూ. 2. అడఁగు. 3. చూ. 2. అరవాయిగొను. 4. చూ. ఉబ్బరపోవు.

**ముఁడుగుఁదామర.** వి. చూ. అత్తపత్తి. రక్తపాదీ; శమీపత్రా; సమంగా; అంజలికారికా; నమస్కారీ; రక్తమూలా; లజ్జా, లోహితయష్టికా.

**ముడుఁచు.** 1. ప్రే. సంకుచ్ (1గ. కోచతి-కుంచతి-కోచితుం - కుంచిత). 2. సక. చూ. ముడిగొను.

**ముడుచు.** సక. చూ. పై.

**ముడుత.** 1. చూ. 1. కంతి. 2. వస్త్రాది భంగః.

**ముడుతలు.** చూ. ఉగ్గులు.

**ముడుపరి.** వి. ఆర్జితవిత్తః; సంరక్షిత ధనః.

**ముడుపు.** 1. చూ. 1. ఆస్తి. 2. ధనస్య భాండం.

**ముడుము.** చూ. ముడుకు.

**ముడుసు.** 1. చూ. ఎమికె. 2. చూ. గ్రంథిలాస్థి (న). 3. చూ. టికము.

**ముడేకము.** చూ. ఏగాని.

**ముడ్డి.** చూ. కుట్టియ.

**ముడ్డిపూస.** చూ. టికము.

**ముణకరాములు.** వి. కింకర్తవ్యతా విమూఢతా.

**ముణుఁగుఁదామర.** చూ. ముడుఁగుఁదామర.

**ముతరాచ.** వి. వాహనకర్షిజాతివిశేషః.

**ముతుక.** 1. చూ. 3. గడితము. 2. చూ. అరగడము.

**ముత్త.** చూ. 2. పై.

**ముత్తడము.** చూ. ఉత్తరిగ.

**ముత్తనియవ్రేలు.** చూ. చూపుడువ్రేలు.

**ముత్తర.** మల్లబంధవిశేషః.

**ముత్తరంగలు.** వి. వళిత్రయం.

**ముత్తరాచ.** చూ. ముతరాచ.

**ముత్తవపులగము.** చూ. చిట్టాముదపుఁజెట్టు.

**ముత్తవ(వ్వ).** వృద్ధపితామహీ.

**ముత్తాత.** వి. వృద్ధపితామహః; ప్రపితామహః.

**ముత్తి.** చూ. పెంద్రోవ.

**ముత్తిగ.** చూ. తొమ్మిది.

**ముత్తియము.** చూ. అణిపూస.

**ముత్తిరాచ.** చూ. ముతరాచ.

**ముత్తిరాజులు.** చూ. పై.

**ముత్తువ.** చూ. చిట్టాముదపుఁజెట్టు.

**ముత్తెపుఁజిప్ప.** 1. చూ. గరిచిప్ప. 2. చూ. అంగరొల్లెలు.

**ముత్తెపుఁబంటి.** చూ. 1. ఇంచు.

**ముత్తెపురిక్కనెల.** వి. చైత్రమాసః.

**ముత్తెపుసవతు.** చూ. చిత్త.

**ముత్తెము.** చూ. అణిపూస.

**ముత్తెరువులాఁడి.** చూ. అంచలవిడిది.

**ముత్తెసరము.** వి. ముక్తాహారవిశేషః.

**ముత్తెసరి.** 1. చూ. పై. 2. సస్యవిశేషః.

**ముత్తైద.** చూ. అయిదువ.

**ముత్తైదువ.** చూ. పై.

**ముత్తొవ.** చూ. చిట్టాముదపుఁజెట్టు.

**ముత్తో.** చూ. అయిదవ.

**ముత్యము.** చూ. అణిపూస.

**ముత్యాలకుచ్చు** చూ. ఒగిదిగ.

**ముత్యాలమ్మ.** చూ. అంకమ్మ.

**ముత్రోవ.** వి. మార్గత్రయం.

**ముత్రోవద్రిమ్మరి.** చూ. అంచలవిడిది.

**ముదము.** చూ. 3. అరవాయి.

**ముదల.** 1. చూ. అప్పణ. 2. చూ. 3. గణుతి. 3. ప్రాచీరనికటభూమిః (స్త్రీ).

**ముదలకించు.** సక. చూ. ఈడాడు.

**ముదలవెట్టు.** సక. చూ. 6. అంచు.

**ముదలించు.** 1. సక. చూ. ఈడాడు. 2. చూ. 5. అడుగు.

**ముది.** 1. చూ. 8. కారు. 2. చూ. అరగడము.

ముదికాకి. చూ. అశ్లకోస.
ముదిగారము. చూ. తఱటు.
ముదిత. చూ. అతివ.
ముదితనము. చూ. 8. కారు.
ముదిమి. చూ. పై.
ముదియ. చూ. అతివ. ముగ్ధా.
ముదియది. వి. వృద్ధా.
ముదియు. అక. చూ. 3. డొక్కు.
ముదివాఁడు. చూ. అరగడము.
ముదిసినవాఁడు. చూ. పై.
ముదుక. 1. వృద్ధః. 2. చూ. 3. గడితము.
ముదుకఁడు. చూ. అరగడము.
ముదుగు. చూ. గడితము.
ముదుటుంగరము. వి. ముద్రాంగులీయకం.
ముదురు. 1. చూ. 8. కారు. 2. చూ. అరగము. 3. అక. చూ. 6. అలరు. 4. చూ. 5. అపరు.
ముదురుమొగ్గ. వి. వికాసోన్ముఖ కోరకః-కం.
ముదుసరి(లి). చూ. అరగడము.
ముదుసరితనము. చూ. 8. కారు.
ముదుసరిది. చూ. ముదియది.
ముద్ద. 1. చూ. 4. గోల. 2. చూ. 2. కోడి. 3. చూ. 1. అడ.
ముద్దకమ్మర. వి. లోహకారజాతివిశేషః. యః శిలాఖ్యః అయః ఉద్ధరతి.
ముద్దకవ్వము. వి. లగ్న దారుమండలః మంథానదండః.
ముద్దకొలిమి. వి. అగ్నికుండః (డం) యత్ర శిలాఖ్యః అయః ద్రవరూపేణోద్ధ్రియతే.
ముద్దయ్య. చూ. అగ్గిమాలి.
ముద్దర. చూ. 4. అచ్చు.
ముద్దరాలు. చూ. 5. గోల.
ముద్దాడు. సక. 1. చుంబనాదిపూర్వం లల్ (10గ. లాలయతి-తే-యితుం-లిత). 2. చూ. 2. అనుకొను.
ముద్దాయి. వి. ప్రతివాదీ (న్. పుం).
ముద్ది. 1. చూ. 2. అంకిలి. 2. చూ. ముదియది.
ముద్దిడు. సక. చూ. 1. ముద్దాడు.
ముద్దియ. 1. చూ. అతివ. 2. చూ. 4. గోల.
ముద్దిఁటె. చూ. ఆరెగోల.
ముద్దు. 1. చూ. 1. అంటు. 2. చూ. తామరదుద్దు. 2. చుంబనం; చుంబితం; పరిణింసా; నిక్షణం; ప్రణిక్షణం; నిమిత్తకం; అధరపానం. 4. చూ. 4. అచ్చు. 5. చూ. 3. పాటన. 6. చూ. 3. గొనబు. 7. విణ. మనోజ్ఞః; మనోహరః; సుందరః.
ముద్దుగలకాళ్లపురువు. చూ. జంటముక్కాలి.
ముద్దుగలతల్లులబిడ్డఁడు. చూ. అగ్గిచూలి.
ముద్దుగుమ్మ. 1. చూ. అంచయాన. 2. చూ. అతివ.
ముద్దుటుంగరము. చూ. ముదుటుంగరము.
ముద్దుఁడు. చూ. అబ్బకాఁడు.
ముద్దుపెట్టుకొను. సక. చూ. 1. ముద్దాడు.
ముద్దురాలు. చూ. అంచయాన.
ముద్దులగుమ్మ. చూ. పై.
ముద్దులాఁడి. 1. చూ. పై. 2. విణ. మనోజ్ఞా.
ముద్దులాఁడు. వి. మనోజ్ఞః; మనోహరః.
ముద్దె. చూ. తామరదుద్దు.
ముద్రపలక. వి. ముద్రణఫలకం.
ముద్రగడ. వి. రాజదండః.
మున్. అవ్య. చూ. ముంగలన్.
మునక. చూ. 2. క్రుంకు.
మునగ. వి. శోభాంజనః; తీక్ష్ణగంధః; శిగ్రుః; బహులపల్లవః.
మునస. వి. జలోద్ధరణ యంత్ర స్తంభాగ్రభాగః.
ముని. 1. వృత్తౌ మునుశబ్దాంతే ఇకారాదేశేనరూపం. 2. అత్యగ్రభాగః. 3. చూ. ఆయతము.

మునికొంగు. చూ. ముంగొంగు.
మునికోల. 1. చూ. ఆరెగోల. 2. చూ. 1. కక్కసము. 3. వృషభవేధన తీక్ష్ణాగ్ర దండః.
మునిచీఁకటి. చూ. గబ్బుచీఁకటి.
మునిమనుమఁడు. వి. ప్రపౌత్రః; నప్తా. (ఋ. పుం).
మునిమనుమరాలు. వి. ప్రపౌత్రీ; నప్త్రీ.
మునిమాపు. చూ. అరసంజ.
మునిముంగల. 1. ప్రప్రథమమ్ (క్రి. వి.); సమ్యక్పురతః (అవ్య).
మునిముచ్చు. పశ్యతోహరః-రా.
మునియేఁడు. వి. పరారి (అవ్య).
మునిషి. వి. 1. తురుష్కోపాధ్యాయః. 2. లేఖకః; లిపికరః.
మును. అవ్య. 1. చూ. ముంగన్. 2. చూ. 5. తొలి. 3. చూ. 1. ఎత్తనగోలు. 4. చూ. 6. కడ.
మునుక. 1. చూ. 2. క్రుంకు. 2. స్నానాచరణం.
మునుకు. 1. అక. చూ. ఆరటపడు. 2. ప్రతివద్ (1గ. వదతి - వక్తుం - ఉక్త). 3. చూ. 11. పలుకు.
మునుకువ. చూ. ఆయతము.
మునుకొను. అక. ముందుపడు.
మునుగ. చూ. మునగ.
మునుగట్టు. చూ. తూరుపుఁగొండ.
మునుఁగు. 1. అక. చూ. ఇలుగు. 2. అక. చూ. 5. ఆడు. 3. చూ. అడఁగారు. 4. చూ. 4. అడఁగు. 5. చూ. ఇఱుముకొను.
మునుచు. 1. ప్రే. చూ. ముంచు. 2. అక. చూ. ముందుపడు.
మునుపడు. అక. చూ. ముందువడు.
మునుపు. 1.చూ.8.తొలి. 2. చూ. 5. తొలి.
మునుమాపు. చూ. అరసంజ.
మునుము. 1. చూ. 5. పాయ. 2. చూ. అంచెలు. 3. చూ. 1. ఎదురు. 4. పురోభాగః. 5. సేనాముఖం; నాసీరం. 6. చూ. 2. ఒత్తడి. 7. విశ. చూ. 2. ఒత్తడము.
మునుముకొను అక. ఎంత్తబద్ధః భూ.
మున్కొను. అక. చూ. ముందుపడు.
మున్గు. 1. అక. చూ. 5. ఆడు. 2. చూ. అడఁగారు. 3. చూ. 4. అడఁగు. 4. చూ. ఇఱుముకొను.
మున్నడి. అవ్య. క్రి. వి. ప్రథమతః (అవ్య); ఆదౌ.
మున్నరక. 1. చూ. తొలిదుక్కి. 2. చూ. 3. చేవ.
మున్నాడి. చూ. మున్నడి.
మున్నీరు. చూ. పటిభేఁడు.
మున్ను. 1. చూ. 5. తొలి. 2. చూ. 1. ఎత్తనగోలు.
మున్నూఱు. వి. శతత్రయీ.
మున్నూలు. వి. త్రిసూత్రీ.
మున్నెరిక. వి. పూర్వానురాగజః విరహతాపః.
మున్నేఁడు. చూ. మునియేఁడు.
మున్పు. చూ. 5. తొలి.
మున్మ. చూ. మునుము.
ముప్పందుడు. సర్వ. త్రింశత్ (సరానార్యోర్వా).
ముప్పటిలు. అక. చూ. అడఁగారు.
ముప్పది. సర్వ. త్రింశత్.
ముప్పదిరెంటిగుంపు. వి చూ. కడచుక్క.
ముప్పదియాఱేండ్లది. వి. షట్త్రింశద్వరా; లోలా; కాముకీ.
ముప్పరువునేల. వి. క్రోశత్రయం.
ముప్పలము. వి. త్రిపలీ; ప్రమాణవిశేషః.
ముప్పాతిక. వి. పాదత్రయం.
ముప్పావు. వి. చూ. పై.

**ముప్పావులా.** వి. పాదోనరూప్యకం.
**ముప్పిడి** చూ. చల్లాణము.
**ముప్పిర.** వి. పిరాఖ్యనాణకత్రయం.
**ముప్పిరి.** 1. చూ. మున్నూలు. 2. విశే. ఉద్వర్తనత్రయవాన్-తీ-త్ (సూత్రాదికం).
**ముప్పిరిగొను.** 1. అక. ఉద్వర్తనత్రయపద్ భూ. 2. చూ. అల్లిబిల్లికొను.
**ముప్పూఁట.** వి. దివసభాగత్రయం.
**ముప్పు.** 1. చూ. 8. కారు. 2. చూ. 2. అంకిలి.
**ముప్పేట.** చూ. మున్నూలు.
**ముప్పేరుపేట.** వి. త్రిసరం.
**ముప్పొత్తులు.** చూ. 5. అలవోక.
**ముప్పోకలాఁడు.** వి. త్రిగుణాత్మకః.
**ముప్పై.** చూ. ముప్పది.
**ముబ్బడి.** విశే. త్రిగుణః-ణా-ణం.
**ముబ్బడించు.** అక. త్రిగుణీ భూ.
**ముబ్బానసవాల్గిము.** చూ. ఇరులుగొంగ.
**ముబ్బె.** చూ. అఱకడ.
**ముబ్బేడ.** వి. బేడాఖ్య నాణకత్రయం.
**ముమ్మడి.** చూ. ముబ్బడి.
**ముమ్మడించు.** అక. చూ. ముబ్బడించు.
**ముమ్మడుగు.** చూ. ముబ్బడి.
**ముమ్మనుమఁడు.** చూ. మునిమనుమఁడు.
**ముమ్మనుమరాలు.** చూ. మునిమనుమరాలు.
**ముమ్మరము.** చూ. 4. అంకపొంకములు.
**ముమ్మరించు.** అక. చూ. 2. అంగవించు.
**ముమ్మాఱు.** వి. త్రిః(అవ్య); త్రికృత్వః (అవ్య); వారత్రయం.
**ముమ్మూడు.** చూ. తొమ్మిది.
**ముమ్మూల.** విశే. కోణత్రయవాన్-వతీ-వత్.
**ముమ్మొనవాలు.** చూ. నుడివోనలుఁగు.
**ముమ్మొట్టు.** వి. మూర్ధాగ్రేసరః.

**ముయ్యంచు.** 1. కోణత్రయం. 2. కోణత్రయవాన్-వతీ-త్.
**ముయ్యంచుతుంగ.** వి. త్రికోణతృణవిశేషః.
**ముయ్యగ్గి.** వి. త్రేతా; అగ్నిత్రయం.
**ముయ్యడ.** వి. కుడపషట్కం (ప్రమాణవిశేషః).
**ముయ్యాకుఁబొన్న.** వి. విదారిగంధా; అంశుమతీ; సాలపర్ణీ; స్థిరా; ధ్రువా; త్రిపర్ణీ; త్రిగుణా; సౌమ్యా; మహోక్లీతకికా.
**ముయ్యాఱు.** వి. షట్కత్రయం.
**ముయ్యేలగుట్టు.** వి. 1. సీమాత్రయ మిలనస్థానం. 2. మార్గత్రయ మిలనస్థానం.
**ముయ్యేడు.** ఏకవింశతిః.
**ముయ్యేఱు.** చూ. అంచలవిడిది.
**మురటి.** చూ. తొంక.
**మురము.** చూ. అందుగు.
**మురళించు.** సక. చూ. 4. కేరు.
**మురాళము.** చూ. దిగదుడుపు.
**మురాళించు.** సక. దిగఁదీయు.
**మురి.** 1. చూ. 1. అదటు. 2. గమనవిలాసః.
**మురించు.** ప్రే. చూ. త్రిప్పియాడు.
**మురికాఁడు.** చూ. 3. గబ్బి.
**మురికి.** చూ. 3. కసటు.
**మురికొను.** సక. చూ. 1. అఱపఱసేయు.
**మురిడీగొలుసు.** వి. సౌవర్ణహస్తభూషావిశేషః.
**మురిపము.** చూ. మురి.
**మురిపెము.** 1. 2 చూ. మురి. 3. చూ. 2. అగ్గలిక. 4. చూ. 2. గరువతనము.
**మురియ.** చూ. 1. అరవరలు.
**మురియఁబడు.** అక. చూ. 2. అంగవించు.
**మురియు.** 1. అక. సవిలాసం గమ్ (1గ. గచ్ఛతి-గంతుం-గత). 2. చూ. 3. ఎగసి

పడు. 3. చూ. 4. కుదియు. 4. చూ. కోఁతపడు. 5. ఛిన్నః భూ; ఛిద్ (కర్మ కర్తృ. ఛిద్యతే).

**మురుగు.** వి. 1. కంకణః-ణం. 2. కంకణ రూపేణ నిర్మితా సువర్ణ తంత్రీ.

**మురుము.** చూ. అందుగు.

**మురువనడ.** చూ. అడ్డవేడెము.

**మురువు.** 1. చూ. 1. అదటు. 2. చూ. 2. అంగము. 3. విశ. మనోజ్ఞః; సుందరః. 4. చూ. 2. గరువతనము. 5. చూ. 1. మురు. 6. చూ. 2. మురుగు. 7. చూ. 3. అగ్గలిక.

**ముర్వు.** వి. కర్ణభూషావిశేషః.

**ముఱకటించు.** సక. చూ. 3. అంకించు.

**ముఱకము.** చూ. 1. అదటు.

**ముఱముఱమను.** అక. కోపవికారవాన్ భూ.

**ముఱముఱలాడు.** అక. చూ. పై.

**ముఱి.** 1. చూ. 4. అగ్గలిక. 2. చూ. 2. అన్నువ. 3. చూ. 2. కుక్క.

**ముఱికి.** 1. చూ. నింకిరి. 2. చూ. 3. కసటు.

**ముఱికిచెమట.** చూ. కొంచు

**ముఱికినాడు.** వి. కస్యచన్రపాన్తస్య నామ (న్.న).

**ముఱిచీఁకటి.** చూ. గబ్బుచీకటి.

**ముఱిముఱిచీఁకటి.** చూ. పై.

**ముఱిముఱి.** విశ. ఈషదీషత్ (అవ్య).

**ముఱియు.** అక. చూ. 3. ఎగసిపడు.

**ముఱు.** 1. చూ. 1. అరవరలు. 2. చూ. 2. జున్ను.

**ముఱుగు.** 1. అక. చూ. 3. కుళ్లు. 2. చూ. 2. ఇఱియు.

**ముఱుగుడు.** చూ. 1. ముంపు.

**ముఱుత్రోవ.** వి. దుర్గంధమార్గః.

**ముఱ్ఱు.** చూ. 2. జున్ను.

**ముఱ్ఱుఁబాము.** చూ. నెత్తురుపెనుబోద.

**ముఱ్ఱుఁబాలు.** చూ. 2. జున్ను.

**ముఱ్వు.** చూ. 2. అంగము.

**ములక.** వి. బృహతీ; క్షుద్రవార్తాకీ; రాష్ట్రికా; విషదా.

**ములికి.** 1. చూ. అంప. 2. చూ. 2. అలుఁగు. 3. బంభరాగ్రకీలః.

**ములు.** 1. చూ. 2. కుట్టుతేలు. 2. నీవారాదిశూకః. 3. తులాకంటకః. 4. మల్లయుద్ధాయుధాగ్రం.

**ములుక.** చూ. ములక.

**ములుకత్తి.** వి. కంటకోద్ధరణాసిః.

**ములుగోల.** 1. చూ. ఆరెగోల. 2. చూ. 3. మునికోల.

**ములుగు.** 1. వి. కుంథనం. 2. చూ. 1. ఉగ్రాణము. 3. అక. కుంథ్ (1గ. కుంథతి -థితుం-త). 4. చూ. 3. అఱచు.

**ములుగొలిమిడి** చూ. 1. గొబ్బి.

**ములుగోరఁట.** వి. ఝింటీ; సైరేయకః.

**ములుచ.** 1. చూ. కావరి. 2. చూ. అబ్బ కాఁడు. 3. చూ. అచ్చిక.

**ములుచఁదనము.** వి. అసాంద్రతా; తనుతా.

**ములుచిఁత.** వి. అలర్కః.

**ములుజెముడు.** వి. త్రికంటకః.

**ములుతారు.** చూ. 1. ఊఁత.

**ములుతోఁట.** వి. కంటకశాకినీ.

**ములుత్రాసు.** వి. క్షుద్రాతులా.

**ములుదోస.** వి. రోమశీ; కర్కారుకీ; రాజపుత్రీ; వ్యాళపుత్రికా.

**ములుపంది.** చూ. 1. ఏదు.

**ములుబంతి.** చూ. గడ్డగోరు.

**ములుము.** వి. కూపజలసాహాయ్యేన కృష్టం క్షేత్రం.

**ములుమోదుగు.** వి. రోహితకః; రోహీ (న్); ప్లీహశత్రుః; దాడిమపుష్పకః.

**ములువాలుగ.** వి. మత్స్యవిశేషః.
**ములువెంపలి.** వి. శరపుంఖి; బాణపుంఖీ; నలికా; చంచలా.
**ములువెలఁగ.** వి. చతురశ్రికః.
**ములువెలమ.** వి. వికంకతః; శ్యామతరుః; కర్ణకః; స్వాదుకంటకః; వ్యాఘ్రపాదః; మృదుఫలః; గ్రంథిలః; కర్ణిరోహణః; శ్వాసద్రుమః; కాకతరుః; రుగ్ణాంగః; ఘాతవల్కలః; కాసతరుః; యజ్ఞాంగః; వ్యాఘ్రపర్ణీ.
**ములుసూపు.** అక. చూ. 2. అంగవించు.
**ముల్కి.** చూ. ములికి.
**ముల్చి.** 1. చూ. అబ్బకాఁడు. 2. చూ. అచ్చిక.
**ముల్లంగి.** వి. మూలకం.
**ముల్లముస్తె.** చూ. ములుచీఁత.
**ముల్లాకుఱాయి.** వి. పత్రపరశు విశేషః.
**ముల్లియ.** 1. వి. ధనబంధనం. ఒ. చూ. 2. ముడుపు.
**ముల్లియవిప్పు.** చూ. కన్నగాఁడు.
**ముల్లు.** చూ. ములు.
**ముల్లుకోల.** చూ. ఆరెగోల.
**ముల్లుచీఁత.** చూ. ములుచీఁత.
**ముల్లె.** చూ. ముల్లియ.
**ముల్లెవిప్పుడువాఁడు.** చూ. కన్నగాఁడు.
**ముళ్లమాటలు.** వి. కుటిలవాక్యాని.
**ముళ్లయతి.** చూ. అరివేరపుఁదపసి.
**ముళ్లు.** చూ. 4. ములు.
**ముపుప.** చూ. ముగురు.
**మువ్వ.** చూ. గజ్జియ.
**మువ్వంచాకు.** చూ. ముయ్యాకుఁబొన్న.
**మువ్వకోడె.** వి. ధూరాదౌ నూత్నతయా కృతాభ్యాసః వృషభః.
**మువ్వగలవన్నెమెకము.** చూ. కోల్పులి.
**మువ్వన్నెమెకము.** చూ. పై.
**మువ్వదోనె.** వి. అధః ఏకఫలకా ద్రోణీ.
**మువ్వన్నె.** విణ. త్రివర్ణః-ర్ణా-ర్ణం.
**మువ్వన్నెకాఁడు.** చూ. ఇరులుగొంగ.
**మువ్వన్నెవిల్లు.** వి. ఇంద్రధనుః(ష్.న); మేఘధనుః; మణిధనుః; వాయుఫలం; ధనుష్యం; కౌశికాయుధం; పరామృతం.
**మువ్వపసరము.** చూ. మువ్వకోడె.
**మువ్వీసము.** వి. షోడశభాగత్రయం; కలాత్రయం.
**మువ్వురు.** చూ. ముగురు.
**మువ్వేలుపులయిక్క.** చూ. ఇరులగొంగ.
**ముసగెస.** చూ. గుసగుస.
**ముసనాబు.** వి. ఆందోలికా పార్శ్వయవనికా.
**ముసముస.** వి. వరాహోద్వ్యాఘ్రాణన ధ్వన్యనుకరణ శబ్దః.
**ముసముసమను.** అక. 1. ముసముసధ్వనిం కృ. 2. చూ. 1. ఎరియు.
**ముసరు.** అక. చూ. 4. అడరు.
**ముసల్మాను.** చూ. తురక.
**ముసలి.** చూ. అరగడము.
**ముసలితనము.** చూ. 8. కారు.
**ముసలిది.** చూ. ముదియది.
**ముసలివాఁడు.** చూ. అరగడము.
**ముసాబు.** చూ. నానుడువాన.
**ముసి.** చూ. 2. అటమట.
**ముసించు.** అక. చూ. 4. అడఁగు.
**ముసిఁడి.** వి. పత్రభంగః; మహాశ్యామః; తిలాభః; వృద్ధధామకః; వృద్ధకంటకః.
**ముసిణి.** చూ. పై.
**ముసినగవు.** చూ. అలఁతినగవు.
**ముసుకు.** 1. చూ. 1. అగడ. 2. చూ. 2. అడ్డపాటు.
**ముసుఁగు.** చూ. పై.
**ముసుఁగుడు.** చూ. 2. అడ్డపాటు.

**ముసుఁగుడువడు.** అక. తిరోహితః భూ; తిరోధా(కర్మ. తిరోధీయతే).

**ముసుఁగుబొంద.** వి. అవినిర్ముక్తశాఖః బాలతాలాది వృక్షః.

**ముసుఁగువడు.** అక. చూ. ముసుఁగుడువడు.

**ముసుఁగువాఱు.** అక. చూ. పై.

**ముసురు.** 1. చూ. నానుడువాన. 2.చూ. 2. చిత్తడి.

**ముసురుకవియు.** అక. చూ. 4. అడరు.

**ముసురుకొను.** చూ. పై.

**ముసురుమూతి.** వి. కోపేన వికృతం ముఖం.

**ముసువు.** చూ. 2. అడ్డపాటు.

**ముస్తియ.** 1. కురువిందః; అబ్దః; చాంగేరీ; ముస్తా; రాజకశేరుకా. 2. ముస్తాకందః.

**ముస్తాదు.** చూ. ఆయితము.

**ముస్తీదు** } చూ. పై.
**ముస్తీఱు** }

**ముస్తె.** చూ. ముస్తియ.

**ముస్తెలమేపరి.** చూ. ఊటమెకము.

## మూ

**మూ.** మూడుశబ్దస్యవృత్తౌ అంత్యవర్ణ యోర్లోపే రూపం.

**మూఁక.** వి. 1. సంఘః. 2. చూ. అంటలు. 3. చూ. ఎట్టపోగు.

**మూఁకవిప్పు.** విశ. విక్షేపకః-పికా-పకం.

**మూఁకుడు.** 1.చూ. దబ్బడము. 2. పాత్రాద్యాచ్ఛాదనం.

**మూఁగ.** 1. చూ. దోమ. 2. చూ. నోరుమెంగ. 3. పక్షివిశేషః.

**మూఁగఁబాఱు.** అక. చూ. 4. అడరు.

**మూఁగతీఁట.** వి. సాంద్రపామావిశేషః.

**మూఁగబోతు.** వి. తుషసమేతం ధాన్యం.

**మూఁగమొగ్గలు.** వి. అవికసితకోరకః_కం.

**మూఁగి.** చూ. నోరుమొఁగ.

**మూఁగు.** అక. చూ. 4. అడరు.

**మూగురు.** చూ. ముగురు.

**మూఁగేలు.** చూ. కంపెలుక.

**మూచూచు.** సక. చూ. ఊరుకొను.

**మూజువాని.** వి. ముఖవాక్యం.

**మూట.** చూ. చిప్పము.

**మూటము.** చూ. ముటము.

**మూడిమంచు.** వి. హిమానీ; హిమసంతతిః (స్త్రీ).

**మూడి.** చూ. కుట్టియ.

**మూడు.** చూ. తిగ.

**మూఁడు.** 1. చూ. పై. 2. అక. చూ. 9. అడరు. 3. చూ. 1. అయిపోవు.

**మూఁడుచు.** ప్రే. జన్ (ప్రే. జనయతి).

**మూఁత.** 1. చూ. 2. అడ్డపాటు. 2. చూ. 3. మూఁకుడు.

**మూతి.** 1. చూ. ముగము. 2. చూ. నోరు.

**మూదల.** చూ. తారకాణ.

**మూదలించు.** సక.1.చూ.2. తారకాణించు. 2. చూ ఎచ్చరించు.

**మూదలిక.** చూ. తారకాణ.

**మూదేవి.** చూ. 1 పెద్దమ్మ.

**మూన.** వి.1. వస్త్రగాలనానంతరం ఉపరిపరిశిష్టవస్తు. 2. ఏరండబీజాదిషు శోధితపరిశిష్టం. 3. చూ. మూఁగబోతు.

**మూను.** సక. వస్త్రాత్ గల్ (ప్రే. గలయతి); వస్త్రగాలితం కృ.

**మూఁపు.** చూ. 1. అరక.

**మూఁపురము.** చూ. ఊపురము.

**మూఁపురముగలయెద్దు.** చూ. అచ్చుఎద్దు.

**మూయి.** చూ. 2. అడ్డపాటు.

**మూయు.** 1. సక. చూ. 2. అప్పళించు. 2. ఆచ్ఛాదనం నిధా• (3గ. దధాతి-ధత్తే-ధాతుం-హిత).

**మూర.** వి. 1. హస్తః (ప్రమాణం). 2. విణ. దీర్ఘః-ర్ఘా-ర్ఘం.

**మూరకోత.** చూ. బారుచాపు.

**మూరకోల.** వి. ద్విహస్తప్రమాణఃదండః.

**మూరిఁబోవు.** 1_3. అక. చూ. 5. 6. 7. అడరు. 3. చూ. 4. అమరు. 5. చూ. 4. అడఁగు.

**మూరు.** అక. చూ. 2. అంగవించు.

**మూరుకొండ.** చూ. కుప్పెకోల (వృక్షకవి).

**మూరుకొను.** సక. చూ. ఊరుకొను.

**మూరుతము.** వి. ముహూర్తః; ద్వాదశ క్షణాః.

**మూరెడు.** విణ. అర్ధహస్తప్రమాణః-ణా-ణం.

**మూర్కొను.** చూ. ఊరుకొను.

**మూర్తము.** చూ. మూరుతము.

**మూల.** 1. చూ. 2. ఇఱుకు. 2. చూ. 2. గొంది. 3. చూ. 1. కొప్పు.

**మూలగ.** చూ. 4. ఊట.

**మూలదుంప.** వి. మూలకందః.

**మూలమట్టము.** వి. కుడ్యకోణపరీక్షక ఫలకం.

**మూలమట్టు.** విణ. ఆమూలం (క్రి.వి.)

**మూలయేలునేర్పరి.** చూ. కోనఱేఁడు.

**మూలఱా.** చూ. గురుజా.

**మూలఱాయి.** చూ. పై.

**మూలఱేఁడు.** చూ. కోనఱేఁడు.

**మూలుగు.** 1. చూ. 1. ములుగు. 2. ప్రసాధనీ (వీరుద్విశేషః). 3. అక. చూ. 3. ములుగు. 4. చూ. 3. అఱచు.

**మూలుగులు.** చూ. మూలుగలు.

**మూల్గు.** చూ. మూలుగు

**మూవ.** 1. చూ. గజ్జియ. 2. చూ. నోరుమెంగ.

**మూవురు.** చూ. ముగురు.

**మూస.** చూ. 9. క్రోవి.

**మూసకము.** చూ. ఎలికె.

**మూసనమురికి.** చూ. అంబేద.

**మూసిక.** వి. మంగలసూత్రే సౌవర్ణమండలస్యోభయతః నిబద్ధా క్షుద్రనాలికా.

**మూసిగంతులు.** చూ. కనుమూసిగంతలు.

## మె

**మెంచ.** 1. చూ. తురక. 2. మ్లేచ్ఛః.

**మెండియము.** వి. తర్జన్యంగులీయకం.

**మెండీఁడు.** చూ. చూపుడువ్రేలు.

**మెండు.** 1. చూ. 5. అగ్గలిక. 2. చూ. 1. అగ్గలము. 3. చూ. 4. అంకపొంకములు. 4. చూ. 2. ఇంకువ.

**మెండుకొను.** 1. 2. అక. చూ. 6. 7. అడరు. 3. చూ. 3. ఆరు.

**మెండెము.** చూ. మెండియము.

**మెండొడ్డు.** అక. చూ. ఈడాడు.

**మెంతి.** వి. మేంధికా; మేంధీ.

**మెంతిమజ్జిగ.** చూ. చల్లకోడి.

**మెంతులు.** వి. మేంధికాబీజాని.

**మెకపుటాము.** చూ. ఇఱ్ఱిగోరజము.

**మెకము.** వి. 1. మృగః; పశుః (పుం). 2. చూ. ఇఱ్ఱి.

**మెకములతిండి.** 1. చూ. కోల్పులి. 2. చూ. చివుఁగి.

**మెకములఱేఁడు.** చూ. పనికతిండి.

**మెకమెకపడు.** అక. చూ. 3. ఎగసిపడు.

**మెకమెకపాటు.** 1. చూ. 1. అదటు. 2. బుభుక్షార్తిః (స్త్రీ).

**మెక్కు.** సక. చూ. 3. అను.

మెగము. చూ. మెకము.
మెగ్గ. చూ. 1. ఊట.
మెచ్చు. 1. చూ. అగ్గింపు. 2. విణ. శ్లాఘ్యః - ఘ్యా - ఘ్యం; స్తుత్యః. స్తోతవ్యః; స్తవనీయః. 3. చూ. 2. ఒసఁగు; 4. చూ. 1. అంటు.
మెచ్చులచెట్టు. చూ. ఈగ్రమాను.
మెచ్చులాడి. వి. శ్లాఘ్యాస్త్రీ. చూ. అంచయాన.
మెచ్చులాఁడు. వి. శ్లాఘ్యః.
మెటిక. చూ. తంతియ.
మెటికె. 1. చూ. పై. 2. అంగుల్యాది సంధి భంగ కృతఃధ్వనిః 3. చూ. 1. అంజ.
మెట్ట. 1. చూ. 2. ఇంకువ. 2. చూ. కరువ. 3. చూ. 1. అంజ. 4. వినైవజలం ఫలిత సస్యం క్షేత్రం.
మెట్టజీలుఁగు. వి. సస్యవిశేషః.
మెట్టతమిన్ని. చూ. నేలతమ్మి.
మెట్టదామర. చూ. పై.
మెట్టపంట. వి. జలసాహాయ్యరహితభూమి సస్యం.
మెట్టవాలుపిట్ట. చూ. అజ్జవాలు.
మెట్టిక. చూ. తంతియ.
మెట్టినిల్లు. వి. స్త్రియాః శ్వశ్రూకులం.
మెట్టియ. చూ.1. మట్టియ.
మెట్టు. 1. చూ. 1. తంతె. 2. చూ. తంతియ. 3. చూ. పులిమెట్టు. 4. చూ. ఉద్దాలు. 5. చూ. ఆకుచెప్పు. 6. ఘట్టః యత్ర కరః గృహ్యతే. 7. చూ. కరువ. 8. చూ. 2. గుట్ట. 9. చూ. త్రొక్కుట. 10. అంకానాం సాకల్యం. 11. సక. చూ.18. ఒత్తు.
మెట్టుకున్. అవ్య.1. అంతతః (అవ్య). 2. సాకల్యేన.
మెట్టుచాలు. చూ. అంచలవిడిది.
మెట్టుబ్రాలు. చూ. అక్షతలు.
మెట్టె. చూ. మట్టియ.
మెట్లగుంటక. వి. కృషిసాధన విశేషః.
మెడ. చూ. 1. అఱు.
మెడకాయ. చూ. పై.
మెడకొంకి. వి. కంఠస్యపురః తిర్యగస్థి(న).
మెడనూలు. చూ. అడ్డిగలు.
మెడపొంపు. చూ. 1. పొంపు.
మెడవంపు. చూ. పై.
మెడవల. చూ. 1. ఊత.
మెడవాలు. 1. చూ. చాకలత. 2. చూ. చాకలవాఁడు.
మెడిదము. చూ. అలికిడి.
మెడుద. చూ. పులిమెట్టు.
మెణకరి. చూ. ఒంటిజందెపువాఁడు.
మెణత. చూ. 1. కళ.
మెతుక. 1. విణ. మృదుః-దుః - ద్వి - దు; కోమలః. 2. చూ. 2 అల్ల.
మెతుకు. 1. చూ. ఓగిరము. 2. చూ. ఇలి.
మెతువు. చూ. 1. మెతుక.
మెత్త. 1. చూ. 3. ఒత్తు. 2. చూ. జానము. 3. చూ. పడక. 4. వృషభపృష్ఠాస్తరణం. 5.విణ. చూ.1. మెతుక. 6.ఆందోళికావాహకానాం భుజయోః నిహితః మృదు కార్పాసాదిబంధః.
మెత్తగిల్లు. అక. మృదూభూ.
మెత్తడము. వి. మృదాదిలేపనం.
మెత్తడి. వి. మత్స్యవిశేషః.
మెత్తన. 1. చూ. 1. నయగారము. 2. చూ. అడకర. 3. విణ. చూ. 1. గోము. 4. క్రి. వి. చూ. ఒయ్యి.
మెత్తనిది. చూ. 1. గోము.
మెత్తబడు. 1. అక. మృదూభూ. 2. చూ. 3. అడఁగు.
మెత్తఁబాటు. 1. చూ. నయగారము. 2. చూ. చాచివేత.
మెత్తబాఁఱు. అక చూ. 1. మెత్తఁబడు.

**మెత్తర.** వి. మల్లబంధవిశేషః.

**మెత్తినగోడ.** వి. అంతరస్థీని నిధాయ లిప్తం కుడ్యం (బౌద్ధాగారాదివత్); ఏడూకం.

**మెత్తు.** 1. వి. ఘనఃమృదాదిలేపః. 2. సక. చూ. 6. అలము.

**మెదడు.** చూ. 3. క్రొవ్వు.

**మెదలిక.** వి. కించిచ్చలనం.

**మెదలు.** 1. అక. చూ. 3. నుసులు. 2. చూ. 8. అడు.

**మెదలుచు(ల్చు).** ప్రే. కించిత్ చల్ (ప్రే. చాలయతి).

**మెదించు.** సక. చూ. 3. నూఱు.

**మెదుక.** 1. చూ. పెసర. 2. చూ. అలుచు. 3. చూ. 2. అల్ల.

**మెదుకగొను.** అక. కేశాః స్వేదాదినా మలినీ భూ.

**మెదుకు.** చూ. మెతుకు.

**మెదుగు.** 1. అక. నిస్తుషీభూ. 2. చూ. 2. ఇఱియు.

**మెదుగుడు.** వి. జీర్ణవస్త్రం.

**మెదుచు.** సక. చూ. 3. నూఱు.

**మెదుపు.** ప్రే. విమృద్ (ప్రే. మర్దయతి).

**మెదువు.** 1. చూ. 1. గోము. 2. చూ. 2. అల్ల.

**మెనుపు.** సక. మంథానదండేన మిశ్ (నామ. మిశ్రయతి).

**మెప్పు.** 1. చూ. అగ్గింపు. 2. చూ. 1. అంటు. 3. చూ. 3 కోరిక.

**మెయి.** వి. 1. చూ. ఒడలు. 2. చూ. 1. అంక. 3. తృతీయావిభక్తి ప్రత్యయః. 4. చూ. 1. అంగము. 5. చూ. 5. మయి.

**మెయికొను.** 1. అక. చూ. మయికొను. 2. చూ. 9. అడరు. 3. చూ. 3. జితపడు. 4. సక. చూ. 3. ఇచ్చగించు.

**మెయికోలు.** చూ. ఇచ్చగింత.

**మెయితాలుపు.** చూ. మయితాలుపు.

**మెయిపొలు.** వి. వృత్తాంతః; వార్తా; ఉదంతః; ప్రవృత్తిః (స్త్రీ).

**మెయిమరుపు.** చూ. అరసావు.

**మెయిమరుగు.** చూ. కత్తళము.

**మెయిమరువు(ర్వు).** చూ. పై.

**మెయిమఱపు.** చూ. 2. అన్ను.

**మెయిమఱువు.** చూ. కత్తళము.

**మెయిమెయి.** చూ. మయిమయి.

**మెయివడి.** చూ. మయివడి.

**మెర.** అవ్య. చూ. 3. అజ్జ.

**మెరక.** చూ. 2. ఇంకువ.

**మెరమెర.** 1. చూ. 1. అఱగలి. 2. చూ. 2. అంగద. 3. చూ. 2. అరమర.

**మెరమెరపడు.** అక. చూ. అంజాయించు.

**మెరమెరలాడు.** అక. చూ. 2. కక్కసపడు.

**మెఱగు.** 1. చూ. 1. మించు. 2. చూ. 1. జగ్గు.

**మెఱచు.** అక. చూ. 2. అలరారు.

**మెఱపు.** 1. చూ. 1. మించు. 2. చూ. 3. జ్యోతి.

**మెఱపుఁదీఁగ.** 1. చూ. ఉప్పరంగ. 2. విద్యుల్లతా.

**మెఱము.** 1. చూ. పిల్లమెఱము. 2. సక. నిఖాతస్థూణాదికం ఇతస్తతః చల్ (ప్రే. చాలయతి).

**మెఱమెచ్చు.** వి. అతీవశ్లాఘా.

**మెఱయు.** 1. అక. చూ. 2. అలరారు. 2. చూ. 3. పరుపడు. 3. ప్రే. ఆవిష్కృ (8గ. కరోతి-కురుతే-కర్తుం-కృత).

**మెఱవడి.** 1. చూ. 1. అగ్గలము. 2. చూ. 4. గరువము. 3. చూ. ఒడికారము. జనయాత్రా; లోకయాత్రా. 5. చూ. 3.

చేవ. 6. చూ. 8. కందువ. 7. విణ. ప్రకాశితః-తా-తం.

**మెఱికలు.** వి. సమ్యగవినిర్గతతుషాః తండులాః.

**మెఱియ.** చూ. గుంద్రాయి.

**మెఱియఁడు.** విణ. అవిచలితః.

**మెఱియత.** విణ. అవిచలితా.

**మెఱుకు.** సక. చూ. 1. పీఁకు.

**మెఱుఁగు.** 1. చూ. 1. మించు. 2. చూ. 1. ఒప్పు. 3. చూ. 2. కళుకు. 4. చూ. 2. డాల్. 5. చూ. 1. జగ్గు. 6. చూ. 1. చమురు.

**మెఱుఁగుఁబోఁడి.** వి. 1. విద్యున్మనోరమా. 2. చూ. అతివ.

**మెఱుఁగుడుఁబురువు.** చూ. మిడుఁగురుపురువు.

**మెఱుఁగుజెట్టి.** చూ. కట్లజెట్టి.

**మెఱుఁగుడునూనె.** వి. ప్రకాశార్థం పేటికాదిషులిప్తం తైలం.

**మెఱుఁగునల్లలు.** చూ. కట్లదండ.

**మెఱుఁగురిక్క.** 1.చూ. గసిరా. 2. ప్రకాశవత్ నక్షత్రం.

**మెఱుఁగుఱాయి.** వి. రజతప్రకాశాధానశిలా.

**మెఱుఁగుసున్నము.** వి. మసృణాసుధా.

**మెఱుపు.** 1. చూ. 1. మించు. 2. చూ. 1. ఒప్పు. 3. చూ. 2. డాల్. 4. చూ. 3. జోతి.

**మెఱుము.** 1. చూ. 1. మించు. 2. అక. చూ. మెఱచు. 3. సక. చూ. 2. ఊటు.

**మెలక.** వి. వంచనా; కపటతా.

**మెలకు.** అక. చూ. 1. ఎరియు.

**మెలఁకువ.** 1. చూ. ఉవవడము. 2.చూ.2. నడక. 3. సావధానతా; అప్రమత్తతా; సయత్నతా. 4 చూ. కాయకము. 5. చూ. 1. పొలయిక.

**మెలఁకువకాఁడు.** చూ. 1. పదిలుఁడు.

**మెలఁగు.** 1. అక. చూ. 2. ఉండు. 2.అప్రమాదేన ప్రవృత్(1గ. వర్తతే-వర్తితుం-వృత్తః). 3. చూ. 8. ఆడు. 4. చూ. 1. జీరువాఱు.

**మెలఁచు.** ప్రే. 1. ప్రవృత్(ప్రే.వర్తయతి-తే). 2. సంచర్(ప్రే. చారయతి-తే).

**మెలఁత(తు)క.** చూ. అతివ.

**మెలన.** వి. గ్రామం పరితః బాహ్యా భూమిః (స్త్రీ).

**మెలపు.** 1. చూ. 5. జతనము. 2. చూ. 1. నయగారము. 3.చూ.2. కిఱుకు. 4. అచలతా; స్థిరతా; స్థైర్యం. 5. ప్రే. మిల్ (ప్రే.మేలయతి). 6. అప్రమాదేన ప్రవృత్ (ప్రే. వర్తయతి-తే).

**మెలయు.** 1. అక. చూ. 2. ఉండు. 2.చూ. 2. మెలఁగు. 3. చూ. 2. పెనయు.

**మెలి(క).** చూ. 3. చిక్కు.

**మెలిగొను.** అక. చూ. అల్లిబిల్లిగొను.

**మెలిగ్రుక్క.** చూ. కూకిపలుకు.

**మెలియు.** అక. చూ. 2. పెనయు.

**మెలివడు.** అక. చూ. అల్లిబిల్లికొను.

**మెలివెట్టు.** సక. చూ. పెనవెట్టు.

**మెలుకువ.** చూ. ఉపవడము.

**మెలుచు.** ప్రే. చూ. పెనఁచు.

**మెలుసు.** చూ. 2. చిక్కు.

**మెల్త.** చూ. అతివ.

**మెల్తుక.** చూ. పై.

**మెల్పు.** చూ. నయగారము.

**మెల్ల.** 1. తిర్యగ్దృష్టిః(స్త్రీ); వక్రదృష్టిః; దృష్టివక్రతా. 2. శ్లేష్మః-ష్మా-ష్మం. 3. క్రి. విణ. చూ. 1. ఒయ్య.

**మెల్లకంటి.** చూ. కాకి.

**మెల్లకంటివాఁడు.** వి. కేకరః; వలిరః.

**మెల్లన.** చూ. అల్లన.

**మెల్లనన్.** అవ్య. శనైః (అవ్య); మందం (క్రి.వి).
**మెల్లా.** చూ. చవిక.
**మెల్లె.** చూ. 1. కళ.
**మెసఁగు.** సక. చూ. 3. అను.
**మెసవు.** చూ. పై.
**మెసవుటు.** చూ. అరగింత.
**మెహదా.** చూ. ఉండసురియ.

## మే

**మే.** 1. చూ. ఒడలు. 2. చూ. 1. అంక. 3. చూ. 1. అంగము.
**మేంఁడ్రించు.** సక. చూ. 1. ఎడఁబాయు.
**మేఁక.** 1. చూ. చింబు. 2. చూ. చింబోతు.
**మేఁకతిండి.** చూ. అడవికుక్క.
**మేఁకపోతు.** చూ. చింబోతు.
**మేఁకరాసి.** వి. మేషరాశిః.
**మేకసొరము.** వి. గాంధారస్వరః.
**మేకు.** చూ. కొఱు.
**మేకొను.** 1. అక. చూ. మయికొను. 2. చూ. 9. అడరు. 3. చూ. 1. అంగవించు. 4. సక. చూ. 11. అంటు.
**మేకోలు.** 1. చూ. ఇచ్చగింత. 2. చూ. ఆయతము.
**మేగలి.** చూ. ఆయతము.
**మేఁగు.** సక. 1. చూ. 6. అలము. 2. చూ. 2. అరికట్టు.
**మేచ.** చూ. పడియ.
**మేజా.** చూ. 5. పలక.
**మేజువాని.** చూ. 5. చదురు.
**మేట.** చూ. ఎక్కలి.
**మేటరి.** చూ. 2. కన్నాకు.
**మేటి.** 1. చూ. ఎకిమీఁడు. 2. చూ. అణిమ. 3. చూ. కొసవుఁగుప్ప.
**మేటిల్లు.** అక. చూ. 2. అంగవించు.
**మేడ.** చూ. ఉప్పరిగ.
**మేడము.** 1. చూ. 6. అంటు. 2. చూ. 1. అని.
**మేడముపొడుచు.** అక. చూ. 5. పెనఁగు.
**మేడి.** చూ. అంజూరు. ఔదుంబరః; జంతుఫలః; యజ్ఞయోగ్యః; సదాఫలః; సుప్రతిష్ఠః; హేమదుగ్ధః; అపుష్పః; స్కంధఫలః.
**మేఁడి(కఱ్ఱ).** చూ. కట్టుఁగొయ్య.
**మేఁడికోరు.** వి. భూనాయకాయదేయః ధాన్యభాగః.
**మేఁడిచీల.** వి. ఈషాశంకుః (పుం).
**మేఁడితోఁక.** చూ. మేఁడి.
**మేఁడిపాలు.** వి. కృషకేణలభ్యః ధాన్యభాగః.
**మేఁడియము.** వి. కర్ణభూషావిశేషాస్త్ర శిల్పం.
**మేఁడిసోఁగ.** చూ. మేఁడి.
**మేడు.** చూ. 2. ఇంకువ.
**మేడుపడు.** అక. అజ్ఞః-విమూఢః-భూ.
**మేఁడెము.** చూ. మేఁడియము.
**మేడ్పడు.** అక. చూ. మేడుపడు.
**మేఁత.** వి. పశ్వాదీనామాహారః.
**మేఁతరి** వి. 1. శిల్పిషుప్రధానః. 2. చూ. ఆబూతికాఁడు.
**మేఁతలాడు.** అక. చర్ (1గ. చరతి_రితుం-త); తృణ్ (8గ. తర్ణోతి - తృణోతి- తర్ణితుం_తృణిత); తృణంఖాద్ (1గ. ఖాదతి_దితుం-త).
**మేఁతాడు.** చూ. పై.
**మేతాలుపు.** చూ. మయితాలుపు.
**మేదకుఁడు.** వి. అమాయావీ (న్. పుం).
**మేదతనము.** వి. సాధుత్వం-తా.

**మేదరవాఁడు.** చూ. దబ్బకాఁడు.
**మేధరి.** చూ. పై.
**మేదావి.** వి. ఔపాసనాగ్ని భస్మ (న్. న).
**మేదించు.** చూ. 3. నూఱు.
**మేన.** వి. సహోదరైః మాతృపిత్రాది సహోదరాదిభిశ్చ దేహసంబంధః; రక్త సంబంధః.
**మేనగోడలు.** వి. స్వస్రీయా; భాగినేయీ; స్వసృపుత్రీ.
**మేనత్త.** వి. పితృష్వసా(ఋ. స్త్రీ).
**మేనబావ.** వి. 1. (ఆత్మనః జ్యేష్ఠః) పితృష్వస్రీయః; పితృష్వసేయః. 2. (ఆత్మనః జ్యేష్ఠః) - మాతులపుత్రః; మాతృభ్రాత్రీయః.
**మేనమఱదలు.** వి. 1. (ఆత్మనః కనీయసీ) మాతులపుత్రీ-మాతృభ్రాత్రీయా.
**మేనమఱది.** వి. 1. (ఆత్మనః కనీయాన్) పితృష్వస్రీయః - పితృష్వసేయః. 2. (ఆత్మనః కనీయాన్) మాతులపుత్రః - మాతృభ్రాత్రీయః.
**మేనమామ.** వి. మాతులః; మాతృభ్రాతా (ఋ. పుం).
**మేనయల్లుఁడు.** వి. భాగినేయః; స్వస్రీయః; స్వసృపుత్రః.
**మేనఱికము.** వి. శారీరసంబంధకృతం బంధుత్వం.
**మేనవదిన.** వి. (ఆత్మనః జ్యాయసీ) పితృష్వస్రీయా మాతులపుత్రీవా.
**మేనా.** చూ. పల్లకి.
**మేని.** చూ. 1. ఒప్పు.
**మేను.** 1. చూ. ఒడలు. 2. చూ. ఉప్పతి. 3. చూ. 1. అంక.
**మేనుతాలుపు.** చూ. మయితాలువు.
**మేనుతాలుపులసామి.** చూ. ఏటిబోటిమగల యెకిమీఁడు.
**మేపచ్చన.** చూ. అంకోనము.
**మేపరి.** చూ. ఆబూతికాఁడు.
**మేపు.** 1. చూ. మేఁత. 2. ప్రే. చర్ (చారయతి) (పశూన్).
**మేపుట్టువు.** 1. చూ. ఆఁడుపడుచు. 2. చూ. కన్నకొడుకు.
**మేపుమేయు.** అక. చూ. గర్వాదు.
**మేమరుపు.** చూ. అరసావు.
**మేమరుగు(వు).** చూ. కత్తళము.
**మేము.** సర్వ. బవ. వయమ్. (అస్మద్-ప్రథమా బవ).
**మేముడు.** చూ. ఇచ్చగింత.
**మేముదు.** చూ. పై.
**మేమెయి.** చూ. మయిమయి.
**మేయు.** సక. పశ్వాదయః ఖాద్ (1గ. ఖాదతి-దితుం-త) - చర్ (1గ. చరతి-రితుం-త).
**మేర.** 1. చూ. ఎల్ల. 2. చూ. ఉగ్గడ. 3. చూ. 2. ఉద్దవడి. 4. చూ. 1. పరుపాటు.
**మేరగట్టు.** చూ. కడపటిమల.
**మేరతప్పు.** అక. సీమాత్రిక్రమణం-మర్యాదాతిక్రమణం కృ.
**మేరు.** వి. 1. భారాద్యధిరోపణార్థం సికతాది నిర్మితః ఉన్నతప్రదేశః. 2. శిఖరమణిః; అగ్రమణిః(పుం). 3. తరలః; హారమధ్యమణిః.
**మేరువ.** వి. వీణాగ్రం.
**మేరువు.** చూ. మేరు.
**మేల్.** 1. చూ. 1. చల్లన. 2. అవ్య. చూ. 3. అజ్జ.
**మేలమాడు.** సక. చూ. 1. అడకించు.
**మేలము.** చూ. 4. ఆట.
**మేలిచ్చుపులుఁగు.** చూ. క్రీడిచెలితేరు.
**మేలిమి.** 1. చూ. అపరంజి. 2. చూ. 5. అగ్గలిక. 3. ఉత్కృష్టతా; శ్రేష్ఠతా. 4. చూ. 4. గరువము.

**మేలిల్లు.** చూ. ఉప్పరిగ.

**మేలు.** 1. చూ. 1. చల్లన. 2. చూ. 1. అంటు. 3. చూ. 1. చొక్కు. 4. చూ. 3. ఒడుపు. 5. చూ. 2. అదటు. 6. చూ. ఆణిమ. 7. చూ. 4. అంకపొంకములు. 8. చూ. 2. అంగము. 9. చూ. 1. ఆదట. 10. చూ. బాగెము. 11. చూ. 2. ఉప్పరము. 12. ఉపకారః. 13. విశేషః. 14. విణ. శుభః-భా-భం. 15. అవ్య. చూ. 3. అజ్జ.

**మేలుకట్టు.** 1. చూ. 1. ఉల్లడ. 2. చూ. తంతియ.

**మేలుకను.** అక. చూ. 3. తెలియు.

**మేలుకనుపు.** ప్రే. బుధ్(ప్రే. బోధయతి).

**మేలుకమ్మిచీర.** వి. త్ర్యంగుల పర్యంత రేఖాంకితం స్త్రీవసనం.

**మేలుకాంచు.** అక. చూ. 3. తెలియు.

**మేలుకాంచుట.** చూ. ఉపవడము.

**మేలుకొం(చు)ట.** చూ. పై.

**మేలుకొను.** 1. అక. చూ. 3. తెలియు. 2. సక. అనురంజ్ (4గ. రజతి-తే-రజ్యతి-తే).

**మేలుకొలుపు.** ప్రే. చూ. మేలుకనుపు.

**మేలుకోలు.** చూ. ఉపవడము.

**మేలుచేయి.** 1. చూ. 5. అగ్గలిక. 2. చూ. అధికః-కా-కం; మహాన్-మహతీ-మహత్. 3. విజయవాన్-వతీ-వత్. 4. చూ. గెలుపుకాఁడు.

**మేలుతరము.** చూ. ఆణిమ.

**మేలుపడు.** అక. చూ. 2. తమకపడు.

**మేలుబంతి.** 1. చూ. ఒజ్జబంతి. 2. కస్యచిత్ కార్యస్య అభ్యాసార్థం ఉదాహరణతయాగృహీతం వస్తు(న). 3. ఆణిమ. 4. చూ. కన్నాకు.

**మేలుమచ్చు.** 1. చూ. ఉప్పరిగ 2. చంద్రశాలా.

**మేలుమచ్చులు.** వి. బాలికానాం క్రీడా విశేషాః.

**మేలురాసి.** వి. వాతశోధితధాన్యస్యరాశిః (పుం).

**మేలువాఁడు.** 1. చూ. పెఱుమగఁడు. 2. చూ. 2. బంగరుకొండ. 3. చూ. కముఁడు.

**మేలైవచ్చు.** అక. చూ. అచ్చివచ్చు.

**మేల్కాంటు.** చూ. ఉపవడము.

**మేల్కనఁబోవు.** అక. చూ. 1. ఆఱడిపడు.

**మేల్కను.** అక. చూ. 3. తెలియు.

**మేల్కనుపు.** ప్రే. చూ. మేలుకనుపు.

**మేల్కొను.** అక. చూ. మేలుకొను.

**మేల్దాపరి.** చూ. ఆటవెలఁది.

**మేల్పడు.** అక. చూ. 2. తమకపడు.

**మేల్బంతి.** ఆణిమ.

**మేల్మచ్చు.** చూ. ఉప్పరిగ.

**మేళగాఁడు.** వి. 1. వాదిత్రవాదకః. 2. వేశ్యాదిజనసంఘ సంబద్ధః.

**మేళగించు.** 1. అక. సంయుజ్ (కర్మ. యుజ్యతే); సంధా (కర్మ. ధీయతే). సంశ్లిష్ (కర్మ. శ్లిష్యతే); సంగమ్ (1గ. గచ్ఛతి-గంతుం-గత); సమ్మిల్ (6గ. మిలతి-మేలితుం-మిలిత). 2. చూ. అనఁగు. 3. ప్రే. సంయుజ్ (7గ. యునక్తి-యుంక్తే-యోక్తుం-యుక్త; ప్రే. యోజయతి; సంగమ్ (ప్రే. గమయతి).

**మేళము.** వి. వాదిత్రద్వయం.

**మేళవించు.** ప్రే. చూ. మేళగించు.

**మేవ.** 1. చూ. 2. అప్పనము. 2. చూ. అంబుపక్కెర.

**మేవడి.** వి.1. నమ్రతా; వినయః. 2.చూ.2. అనువు. 3. ఉచితః; యుక్తః. అర్హః.

**మేవడికాఁడు.** వి. 1. వినయవాన్ (త్. పుం). వినీతః. 2. చూ. అనువరి.

**మేవు.** సక. చూ. మేగు.

## మై

**మై.** చూ. మయి.
**మైకము.** చూ. 2. అదటు.
**మైకొను.** అక. చూ. మయికొను.
**మైకోలు.** చూ. ఇచ్చగింత.
**మైఁగసురా.** చూ. ఇంతికొపుంజు.
**మైజాఱు.** చూ. పైఁటకొంగు;
**మైతాలుపు.** చూ. మయితాలుపు.
**మైద.** 1. చూ. 2. అదటు. 2. చూ. గోరట.
**మైదగోరంటు.** వి. కురంటకః
**మైదానము.** చూ. 2. బయలు.
**మైదు.** చూ. మయిదు.
**మైనపుజిడ్డు.** వి. మధూచ్ఛిష్టలిప్తం వస్త్రం.
**మైనపువత్తి.** వి. మధూచ్ఛిష్టవర్తికా.
**మైనము.** చూ. మయినము.
**మైపూఁత.** వి. అంగరాగః; శరీరలేపనద్రవ్యం.
**మైపోక.** చూ. ఉలకన.
**మైమయి.** చూ. మయిమయి.
**మైమై.** చూ. పై.
**మైమఱచు.** చూ. ఎడఁజెందు.
**మైమఱపు.** చూ. 2. అన్ను.
**మైమఱువు.** చూ. కత్తళము.
**మైమోజు.** చూ. గగురు.
**మైల.** చూ. మయిల.
**మైలక్రోవి.** చూ. తూతకొమ్ము.
**మైలచాయతొండ.** వి. దుష్ప్రిఖా; (సరటా విశేషః).
**మైలపడు.** 1. అక. చూ. కందువాఱు. 2. అశుచి-అపవిత్రః భూ.
**మైలారి.** వి. భిక్షుకః యో వైశ్యానేవ యాచతే.
**మైలారు.** చూ. మయిలారు.
**మైలావు.** వి. ధూమ్రవర్ణా గౌః (ఓ.స్త్రీ).
**మైలు.** చూ. మయిలు.
**మైలుతుత్తము.** చూ. మయిలుతుత్తము.
**మైవడి.** చూ. మయివడి.
**మైసాక్షి.** వి. ఓషధివిశేషః యస్యా ధూమః రోగశాన్త్యర్థం ఉపయుజ్యతే.

## మొ

**మొంగ.** చూ. 1. ముంగ.
**మొంటె.** వి. క్షుద్రశూర్పః (ర్పం) యేన బాలికాః క్రీడన్తి.
**మొండరి.** వి. మూర్ఖః; స్తబ్ధః.
**మొండాడు.** అక. మూర్ఖతాం కృ. స్తబ్ధవ్యవహారం కృ.
**మొండి.** వి. 1. ఛిన్నహస్తపాదః. 2. ఛిన్నత్వం. 3. చూ. ఉక్కిఁడు. 4. ఛిన్నైకదేశః. 5. కుంఠితః-తా-తం. 6. శూన్యః-న్యా-న్యం.
**మొండికట్టె.** 1. చూ. అడిగొంటు. 2. చూ. ఉక్కిఁడు. 3. చూ. మొండరి.
**మొండియము.** చూ. 2. అట్ట.
**మొండు.** చూ. మొండి.
**మొండుమొల.** చూ. 2. మొండి.
**మొండె.** చూ. 2. అట్ట.
**మొండెపుగాము.** చూ. చీఁకటిగాము.
**మొండెపురక్కసుఁడు.** వి. కబంధః.
**మొండెము.** చూ. 2. అట్ట.
**మొకములు.** వి. శ్రేష్ఠకౌశేయ విశేషః.
**మొకమాలు.** చూ. పై.
**మొకమాట.** వి. బాలక్రీడావిశేషః.
**మొకము.** 1. చూ. గుంబము. 2. చూ. ముగము. 3. చూ. 1. ఎదురు.
**మొకరము.** 1. చూ. 1. కంబము. 2. చూ. గడియ.
**మొకరి.** విశ. 1. ముఖరః; ధ్వనికరః. 2. అసంబద్ధ ప్రలాపీ(న్).

**మొక్క.** 1. చూ. 1. ఇగురు. 2. చూ. 5. అటమట. 3. పల్లవాంకురః-రం; పల్లవోద్గమః. 4. విణ. కుంఠితాగ్రః-గ్రా-గ్రం.
**మొక్కచెడు.** అక. చూ. అవమానపడు.
**మొక్కట్టు.** వి. ముఖరీతిః (స్త్రీ); ముఖాకారః.
**మొక్కటీఁడు.** వి. 1. హ్రాస్వదంతః గజః. 2. చూ. 5. కటికి.
**మొకిక్కడి(డీఁడు).** చూ. 1. మొక్కటీఁడు.
**మొక్కడము.** వి. ధృష్టతా; ధార్ష్ట్యం; అభీరుతా.
**మొక్కఁడు.** చూ. 3. కలవాఁడు.
**మొక్కపడు.** అక. చూ. అవమానపడు.
**మొక్కపోవు.** అక. 1. కుంఠీ భూ; వ్యర్థీ భూ. 2. చూ. అవమానపడు.
**మొక్కమామిడి.** చూ. చాగ.
**మొక్కము.** వి. మోతుకః; శిఖరీ; ముష్కః; క్షారాయః; ఝూటలః; కాలముష్కకః.
**మొక్కరము.** చూ. మొకరము.
**మొక్కలము.** 1. చూ. 3. అంగద. 2. చూ. 4. అగ్గలిక. 3. చూ. 3. చేవ. 4. కుటిలస్వభావః. 5. విణ. కుటిలః; కుటిలస్వభావః. 6. అప్రతిహతః - తా-తం; అకుంఠితః-తా-తం.
**మొక్కలములు.** వి. (బవ) కుటిలవచనం.
**మొక్కలి.** 1. చూ. అడిగొంటు. 2. చూ. ఉక్కడీఁడు.
**మొక్కలికాఁడు.** చూ. పై.
**మొక్కలించు.** అక. 1. కుటిలవ్యవహారం కృ. 2. చూ. 1. అంగవించు.
**మొక్కలింపు.** వి. కుటిలవ్యవహారాచరణం.
**మొక్కలీఁడు.** చూ. మొక్కలి.
**మొక్కలు.** వి. (బవ). జూర్ణవిశేషః.
**మొక్కలుఁడు.** చూ. ఉక్కడీఁడు.
**మొక్కళము.** చూ. 4. మొక్కలము.
**మొక్కళి.** 1. చూ. పనికుచ్చె. 2. చూ. ఈంద్రవాఁడు. 3. లాభాలాభ విమర్శశూన్యః. 4. ఫాలఫల్యం.
**మొక్కు.** 1. చూ. ఎరగుఁడు. 2. అక. చూ. 2. అయిదుపదిచేయు. 3. చూ. 1. కోరగించు.
**మొక్కుబడి.** చూ. గండ.
**మొక్కుసొక్కుసామి.** చూ. ఇరులుగొంగ.
**మొఖాసా.** వి. కరహీనా భూమిః (స్త్రీ).
**మొగ.** 1. చూ. గుంబము. 2. చూ. అరవిరి. 3. చూ. ముగము. 4. అప్రాణినాం ముఖం; అగ్రం. 5. చూ. 1. ఎత్తనగోలు. 6. నద్యాదీనాం ముఖం.
**మొగకట్టు.** చూ. 1. ఉగ్గడించు.
**మొగకొను.** అక. చూ. 1. ఎదురుకొను.
**మొగచాటు.** చూ. 2. వెళుచు.
**మొగడ.** వి. 1. నాట్యే ఉత్తానతయా తథా నమనం యథా శిరః పాదౌ స్పృశేత్. 2. చూ. అరవిరి.
**మొగడదామర.** చూ. అత్తపత్తి.
**మొగడించు.** అక. చూ. 1. కోరగించు.
**మొగడు.** చూ. 3. కొప్పు.
**మొగతప్పు.** అక. చూ. 1. అయిదుపదిచేయు.
**మొగతిరుగు.** చూ. పై.
**మొగదల.** 1. చూ. 1. ఎదురు. 2. పురోభాగః; అగ్రభాగః.
**మొగదారమ్మ.** చూ. అంకమ్మ.
**మొగనాళము.** వి. నిస్సరణం; గృహాదీనాం పురోభాగః.
**మొగపడు.** సక. చూ. 3. కను.
**మొగపాళము.** చూ. మొగనాళము.
**మొగపిటికి.** చూ. తాఁబేలు.
**మొగపు.** వి. హారాదీనాం అగ్రభాగః.

మొగపుతీఁగె. వి. ముఖభూషావిశేషః.
మొగపోల్కికూటమి. వి. చూ. పయికూటమి.
మొగపుముత్యము. వి. అగ్రమౌక్తికం; సంధిస్థానమౌక్తికం
మొగబీరచెట్టు. చూ. 1. గొబ్బి.
మొగమాట. 1. ముఖభీతిః (స్త్రీ). 2. చూ. 2. గరుసు.
మొగమాటము. చూ. 1. పై.
మొగమిచ్చు. చూ. 2. గరుసు.
మొగమిచ్చు. అక. సుముఖః భూ; అనుకూలః భూ.
మొగము. 1. చూ. గుంబము. 2. చూ. ముగము. 3. చూ. 1. ఎదురు. 4. విణ. చూ. 3. కుంకటి.
మొగముట్టు. వి. అశ్వముఖాలంకారః.
మొగమునన్. అవ్య.1.చూ.తోడుతోన్. 2. చూ. 2. కూడన్.
మొగమోట. వి. 1. దాక్షిణ్యం; సుశీలతా, ఆదరశీలతా. 2.చూ.3.అరవాయి.
మొగమోటము. చూ. పై.
మొగమోడు. 1. అక. దాక్షిణ్యవాన్ భూ. 2. చూ. 2. అరవాయిగొను.
మొగరంబము. చూ. జంటముక్కాలి.
మొగరము. వి. 1. నికేతనాగ్రిమస్తంభః. 2. చూ. ఒడ్డణము.
మొగరాడు. చూ. 1. మొగరము.
మొగరించు. సక. చూ. 4. అప్పళించు.
మొగలి. వి. చూ. గేదఁగి. మహాపత్రః; మహాశాఖః; సుగంధా; సుపత్రికా; వర్షపుష్పీ; కేతకీ; కృష్ణసర్పప్రియా.
మొగలింగ. చూ. ఇసుకగ్రమాను.
మొగలిపనస. చూ. అనాస
మొగలిజేకు. వి. 1. కంఠనఖక్షతమ్. 2. చూ. ఒగిదిగ.
మొగలివాకిలి. 1. చూ. అజారము. 2. చూ. తలదువారము.
మొగలేఱు. వి. సువర్ణముఖీనదీ.
మొగవడము. వి. గజోపరికంబలః
మొగవాళము. చూ. మొగనాళము.
మొగవీణె. వి. ముఖవీణాఖ్యవాద్యవిశేషః.
మొగసరి. చూ. మొగముట్టు.
మొగసల. 1. చూ. అజారము. 2. గేహప్రథమద్వార సమీపపాళీ.
మొగసాల. చూ. పై.
మొగసిరి. వి. వశీకరణకర్మ (న్. స).
మొగాళము. చూ. 6. మొగ.
మొగి. 1.చూ.అంటలు.2.చూ.ఆయతము.3. చూ. 1. అంగము.
మొగిన్. అవ్య. చూ. ముంగలన్.
మొగిటి(పురువు). చూ. గోడపురుగు.
మొగియు. 1. అక. చూ. 1. అంగవించు. 2. చూ. 4. అడరు.
మొగిలివిరునీరు. వి. ప్రశస్తంజలం.
మొగిలు. చూ. కందరము.
మొగిలుదొంతికలు. చూ. అగడపలు.
మొగుచు. ప్రే. ముకుల (నామ. ముకుళయతి).
మొగుడు. అక. చూ. 1. కోరగించు.
మొగుడుచు. ప్రే. చూ. మొగుచు.
మొగుడుదామర. చూ. అత్తపత్తి.
మొగుపు. చూ. ఎరఁగుడు.
మొగులు. 1. చూ. కడకు. 2. చూ. కందరము.
మొగులుకడిమి. చూ. నీరుకడిమి.
మొగులుదారి. చూ. అప్పుతాత.
మొగులువిరి. చూ. 1. జలకము
మొగులువిరిపొది. చూ. ఏటిఱేఁడు.
మొగులెక్కుప్రోడ. చూ. ఇంతికాపుంజు.
మొగుల్పుట్టువు. చూ. 1. మించు.
మొగువు. చూ. ఎరఁగుడు.

